# యోగవైభవం

శరీరం దృఢంగా ఉండాలి. అలా దృఢంగా ఉంచుకోడానికి మనం గట్టి ప్రయత్నంచేయాలి. బలవర్ధకమైన ఆహారం తీసుకొని వ్యాయామం చేయాలి. అప్పుడే కండపుష్టి కలవారవుతారు. అటువంటి వారు ఏపనియైనా ఉత్సాహంగా చేయగలుగుతారు. అత్యాధునిక ప్రపంచంలో కొందరు తినకుండా మూతికి మెతుకులు రాసుకొని చేతులు కడుగుకుంటున్నారు. అదే **నాగరితక** అని చాటి చెబుతున్నారు. వారు ఏపనీ చేయలేరు. ఎందులోనూ పాల్గొనలేరు. దేనికీ తట్టుకొనే ఓర్పు, నేర్పు వారికి ఉండవు. ఇటువంటి వారిని గూర్చే **"ఈసురోమని మనుషులుంటే, దేశమేగతి బాగుపడునోయ్"** అన్నాడు గురజాడ.

స్వామి వివేకానంద, ఆధ్యాత్మికంగా ఎదగాలంటే శారీరకంగా దృఢత్వాన్ని సాధించాలని చెప్పారు. అప్పుడే వారు సాధించదలచిన లక్ష్యాన్ని చేరగలుగుతారు. విద్య, ఉద్యోగ, వ్యాపారాలలో, వ్యవసాయంలో, పరిశోధనలో, పరిశ్రమ నిర్వహణలో ఇంకా ఏ రంగంలో వారైనా రాణించాలంటే ముందుగా వారు ఆరోగ్యంగా ఉండి, ఎప్పుడూ ఉత్సాహవంతులై ఉండాలి. **"అనిర్వేదోహి సతతం సర్వార్థేషు ప్రవర్తకః"** అని రామాయణం ఈ విషయాన్ని ఉద్బోధించింది. ఇనుపకండరాలు, ఉక్కు నరాలుగల యువ సమాజం ద్వారా దేశ భవిష్యత్తును తీర్చిదిద్దగలనని వివేకానంద ఆకాంక్షించారు. అది యోగాసనా లభ్యసించడం వలన శారీరక దృఢత్వం, మానసిక ధైర్యం సాధ్యపడుతుంది.

యోగం, యమ, నియమ, ఆసన ప్రాణాయామాదులైన 8 విభాగాలుగా విభజింపబడి ప్రజలకు ఉపయోగంగా ఉంటుంది. సాధకులు సామాన్యంగా అభ్యాసం చేసే ఆసన, ప్రాణాయామాలు మంచి అలవాట్లను, యమనియమాలనూ పెంపొందింప చేస్తాయి. వ్యక్తిత్వ వికాసానికి ఇవి ఎంతో దోహదం చేస్తాయి. వారు సమాజానికి ఆదర్శప్రాయులౌతారు. వారు చేసే మంచిపని వలన లోకంలో ఆరాధ్యులౌతారు. క్రమం, క్రమశిక్షణ యోగం వలన ఏర్పడతాయి.

రోగనిరోధక శక్తి లోపించి అనారోగ్యముల పాలగుటకు ముందే సకల రోగ నివారిణియైన యోగమును అభ్యశించి ఆరోగ్యమును పొందుట బుద్ధిమంతుల లక్షణం. కష్టపడెడివారలకు రోగములురావు అనెడిది అనుభవంలో ఉన్న సత్యం.

**తే.గీ. చెడిన ఆరోగ్యమును బాగు చేయుకంటే**
**ముందుగా ననారోగ్యంబు పొందనట్టి**
**యత్న మొనరించుటయె న్యాయ్య మగును దలప...**
**వ్యాధులకు యోగ మారోగ్య సాధనంబు !**

**తే.గీ. ఉదర దోషంబు దొలగును, నూబకాయ**
**మడగు, నంద మారోగ్యంబు నందc గలుగు,**
**సుఖము, సంతాన భాగ్యంబు జూరగొనగ,**
**సాధకులకు యోగమొక రసాయనంబు !**

యోగం వలన ఎన్నో ప్రయోజనాలు ఉన్నాయని పెద్దలు అన్నారు. ఒత్తిడులను తగ్గించి శాంతిని చేకూర్చే ఈ యోగసాధనకు ఏ ఖర్చు లేదు. యోగాభ్యాసం చేయాలన్న సంకల్పమే మనలోని బద్ధకాన్ని పోగొట్టి, కార్య శూరులను చేస్తుంది. మానసికమైన వ్యాధులను తగ్గించి ఆత్మ విశ్వాసాన్ని పెంచుతుంది.

**తే.గీ. యోగ శక్తితో కాయంబు బాగుపడును !**
**సకల రోగములు నశించు, శాంతి కలుగు!**
**నరముల బలహీనత పోవు, బరువు తగ్గు !**
**మానసిక బాధ, తలనొప్పి మాయమగును !**

ధ్యానం, యోగాసనాలు అభ్యసించినవారికి యౌవనం తరగదు. ముఖమునందు ముసలితనం కనబడదు. నిరంతరం వారు ఉత్సాహవంతులై సమాజహిత కార్యక్రమాలలో విరివిగా పాల్గొంటారు. ఎన్నో విధాల అంతరికీ ఉపకరించే ఈ యోగాసనాభ్యాసం మత సంబంధమైనది కాదు. ఒక కాలానికి, దేశానికీ పరిమితమైనది కాదు. శరీర ఆరోగ్య పరిరక్షణే దీని ధ్యేయం. ప్రపంచ



అప్పుడే జన్మ సార్థకమవుతుంది. ఆ విషయమునే హనుమ గురునితో విన్నవించుకున్నాడు.

**బాహ్యమాంతరమైన సర్వంబుతమము**
**నాహరించెడు దొరవంచు నాశ్రయించి**
**నాడ, సత్యప్రతిష్ఠితా! నాటి మాట**
**సూటి, మదినెంచి నన్నేలc జూడుమయ్యా!**

సూర్యుడు, బయటి చీకట్లను పారద్రోలుటే కాదు. హృదయాకాశమున తేజోమయుడై కొలువుండి, విశుద్ధ చక్రమును శుద్ధిచేసి లోపలి చీకట్లను కూడ పరిహరించునని యోగులు స్వానుభవ పూర్వకంగా వివరిస్తున్నారు. అజ్ఞానము జీవభావమును తొలగించి పరమాత్మ దర్శనము కల్గించును. సత్యము నందు బ్రహ్మము ప్రతిష్ఠింపబడును. "సత్యేబ్రహ్మ ప్రతిష్ఠితమ్" సత్యవాది, పరబ్రహ్మ స్వరూపుడు అయిన సూర్యుడు, శిష్యుని వాక్పటుత్వము గల వేదవేత్తగా, నవవ్యాకరణ పండితునిగా శిక్షణ ఇచ్చాడు.

హనుమంతుడు, సూర్యునకు అభిముఖముగా నుండి వెనుకకు నడచుచు గురువు బోధించేది శ్రద్ధగా గ్రహించి, సకల విద్యావిశారదుడైన పండితుడుగా ప్రసిద్ధిగాంచి, పురుషోత్తముడైన ఆ శ్రీరామునిచే ప్రశంసలందుకున్నాడు. "కష్టే ఫలే" కష్టపడిన వానికి ఫలము లభించుననే పెద్దల వాక్యం హనుమంతుని విద్యాభ్యాస సందర్భమున చక్కగా నిరూపింపబడినది. మిగుల సంస్కార సంపన్నమై, హృదయమునకు హత్తుకొను కళ్యాణవాణి, అతని వైదుష్యవైభవమును ప్రకటించును.

**శ్లో॥ సంస్కారక్రమ సంపన్నాం, అద్రుతా మవిలంబినీం।**
**ఉచ్చారయతి కల్యాణీం, వాచం హృదయహర్షిణీమ్॥**

(వాల్మీకి కి.కాం.)



పెరిగి పెద్దవాడైన హనుమ, ఆనాటి సూర్యుని మాట (వరము)ను తలచుకొని నిరంతరం మేరుపర్వతానికి ప్రదక్షిణ చేస్తూ, దేవధనములను కాపాడుతూ, తన వెలుగులచే సకల లోకములను ప్రకాశింపచేయువాడైన సూర్యుని సమీపించి, భక్తితో అంజలి ఘటించి, నమస్కరించి విద్య నర్థించాడు.

**దేవ! యను గ్రహింపవలె దేవర మున్ సెలవిచ్చినట్టులా**
**యా వివిధాగమంబులితిహాస పురాణ ముఖాఖిలాంగముల్**
**కావలెనంచు వచ్చితి; నికామదయా! జననంబు సార్థకం**
**బై వెలుగొంద జేయుమనయం, బనయజ్ఞుని, నన్ను విజ్ఞుగాన్".**

భారతీయ ఋషి సంప్రదాయంలో ధర్మమును ప్రతిపాదించే వేదాంగములు, వేదార్థమును వివరించుటకు సహకరించే వేదాంగములు (శిక్ష, వ్యాకరము, జ్యోతిషము, కల్పము, వేదాంతమును బోధించే ఉపనిషత్తులు, ఇదిహాసములు, పురాణములు, కావ్యములు మొదలగునవి అన్నీ ఆత్మజ్ఞానమునకు ఉపకరించే (బోధించే) విద్యలుగా ప్రసిద్ధములు.

అట్టి విద్య వలన జ్ఞానమేర్పడి జన్మ సార్థకమవుతుంది. ఆత్మజ్ఞానము నిచ్చే విద్యలేనివాడు మానవుడు వింతపశువుగా పరిగణింపబడతాడు. తినుట, కనుట మొదలైనవి ప్రాణులన్నింటికి సహజమే అయినా, మానవుడు జ్ఞానము చేతనే విశిష్టత సంపాదించుకున్నాడు.

**"నాపృష్టః కస్యచిత్ బ్రూయాత్"** అనే శాస్త్రనియమమును అనుసరించి ఆత్మోన్నతికి సహకరించే ఈ విద్యలు అడుగని వానికి బోధింపరాదని పెద్దలు ఆదేశించారు. కనుక ఇచ్చట హనుమంతుడు తనకా విద్యలు కావలెనను బుద్ధితో గురువును ఆశ్రయించుటకు వచ్చాడు.

"నికామదయా" స్వభావుడు, సూర్యుడిట గురువు. ఎట్టి ప్రతిఫలాపేక్షలేక అతడు నిఖిల లోకములకు వెలుగు ఇచ్చుటయే అందుకు నిదర్శనము. విద్యను వెలుగుతో పోల్చటం మన సంప్రదాయం. సద్గురువు, శిష్యుని అజ్ఞాన తిమిరమును పోగొట్టి, మరల పుట్టువులేనట్టి ఉత్తమ స్థితిని కలిగించుటకు సాయపడుతున్నాడు.



ప్రజలందరికీ అవసరమైనది. కావుననే అంతర్జాతీయ యోగదినోత్సవంనాడు 187 దేశాలవారు అధికారికంగా యోగా దినాన్ని పాటించారు.

**"శరీరమాద్యం ఖలు ధర్మ సాధనం"** అన్నారు పెద్దలు. ధర్మం అంటే కర్తవ్యమని అర్థం. తాము చేయవలసిన పనులు చేసేందుకు కూడా శరీరం దృఢంగా ఉండాలి. కర్తవ్య సాధనకు శరీరమే ముఖ్యం. అది అనారోగ్యంతో మూలుగుతూ మూలపడి ఉంటే సేవచేయడానికి ఎవ్వరూ ఇష్టపడరు. అందువలన ఊపిరి ఉండేవరకూ ఉత్సాహవంతులై ఉండడానికి సాధన చేయాలి. ప్రాణామాయమంటే ఒక క్రమంలో ఊపిరి బిగపట్టడం, విడిచిపెట్టడం. దీనివలన ఆరోగ్యంతోపాటు ఆయుర్దాయం కూడా అభివృద్ధి పొందుతుంది.

ఎంత తెలిసినా పాటించేందుకు ముందుకు రాకపోవడం మానసిక బలహీనత. సజ్జన సాంగత్యంతో సమయాన్ని సార్థకం చేసుకోవాలి.

పనియే దైవంగా భావించి పాటుపడ్డవారికి ముందు ముందు ఆనందం లభిస్తుంది. యోగాభ్యాసం ఆ ఓర్పును, నేర్పునూ సమకూరుస్తుంది.

**"యోగః చిత్తవృత్తి నిరోధః"** అని పతంజలి మహర్షి యోగ ప్రయోజనాన్ని వివరించారు. యోగం వలన సాధకుల బుద్ధి వికసించి, కామక్రోధ మదమాత్సర్యముల నుండి వారు విముక్తులౌతారు. సమాజంలో ఉన్నత వ్యక్తిత్వం గలవారుగా ఎదిగి త్యాగనిరతి, సేవాభావంతో మెలగుతారు. ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దబడతారు. దేశాభ్యుదయానికి కారకులు అవుతారు. యోగం ఒక నిరంతర సాధనావశ్యకంగా పెద్దలు గుర్తించారు.



# కల్యాణ గాథ

లోకంలో కొందరు క్షణికావేశంతో ఆత్మహత్యకు పాల్పడటం జరుగుతోంది, వారు మరణించటం వలన సమస్యకు పరిష్కారం లభింపకపోగా తమపై ఆధారపడినవారిని, తమను ఆశ్రయించుకొని బ్రతుకుతున్న వారిని అనాధలనుచేసి, వీధులపాలు చేయటమే అవుతుంది, అది వారి అసమర్థతకు నిదర్శనంగా కూడా ప్రదర్శింపబడుతుంది.

మనసు సాగరం వంటిది. అందులో ఉద్భవించే ఆలోచనా తరంగాలు అనేకం, తొందరపడి ప్రతి ఆలోచనా అమలుచేయాలని పూనుకోవటం అవివేకమే అవుతుంది. నిబ్బరంగా, నిదానంగా ఆలోచించి పరిశీలించినప్పుడు ముందు తానెంత తప్పుగా తలపోసింది అర్థమై చివరకు సిగ్గుపడేస్థితి ఏర్పడుతుంది.

సీతమ్మ, కపటియైన రావణునిచే అపహరింపబడి, అశోకవనములో శింశుపావృక్షం క్రింద రాక్షస స్త్రీలనడుమ నిర్బంధింపబడింది. రామధ్యాన పరాయణయైన సీతను రావణుని అధికారసంపదలు ఏవిధంగాను వశపరచుకోక పోయాయి. పదిమాసాల కాలం గడిచింది. అప్పుడు ఒకనాడు రామదూతయైన హనుమంతుని ద్వారా రాముని క్షేమవార్తవిని, అతడు ఆమెను కుశలమడిగినట్లు తెలిసికొని, అధికమైన ఆనందాన్ని అనుభవించింది తను, ఇన్నాళ్ళు కష్టాలతో, కన్నీళ్ళతో బ్రతుకుసాగించినందుకు వినదగినమాట విన్నానని పొంగిపోయింది.

"నూరేండ్లు బ్రతికిఉండి మానవుడు ఆనందమును పొందుచున్నాడు" అన్న లోకోక్తి నాకు ఈ సమయంలో గుర్తుకువస్తోంది నాయనా! "అని సీత హనుమంతునితో అంది". "బ్రతికియుండిన సుఖములు బడయవచ్చు" అన్నదే అందులోని పరమార్థం.

**కల్యాణీ బతగాథేయం లౌకికీ ప్రతిభాతిమా ।**

**ఏతి జీవన్త మానందో నరం వర్షశతాదపి ॥ (6-34-5)**

సీత చెప్పిన ఈ మాట "కల్యాణి గాథ"గా అభివర్ణింపబడింది. అంటే అది సత్యమును ప్రతిపాదించే శుభచరితమని అర్థం. ఇట్టి మహనీయ చరిత్రయే సమాజమునకు ఆదర్శమై అనర్థములను నిరాకరించటానికి సమర్థమవుతుంది.



సుందరకాండలో హనుమంతుని బలపరాక్రమాలు, ధీశక్తి, సమయస్ఫూర్తి మొదలగు గుణములు విశేషంగా కీర్తింపబడగా ఇక్కడ ఉత్తరకాండలో హనుమజ్జననం, బాల్యం, వరప్రాభవాలు, విద్యావైభవాలు ఉదాత్తంగా వర్ణింపబడ్డాయి.

అంజనకు పుట్టినవాడు కనుక ఆంజనేయుడు. ఇతడు పుట్టగానే తల్లి ఆహార సంపాదనకని అడవిలోకి వెళ్ళింది. ఇంతలో బాలునికి ఆకలివేసింది. కళ్ళుతెరచి చూడగానే ఆకాశంలో ఉదయిస్తున్న సూర్యుడు ఎఱ్ఱనిపండులా కనిపించాడు. దాన్ని మింగటానికని బయలుదేరాడావాయు తనయుడు.

ఆ రోజు సూర్యగ్రహణం అందువల్ల రాహువు కూడా సూర్యుని సమీపించాడు. అప్పుడా బాలుడు వేడి పండును విడిచి, నేరేడు పండులా నల్లగా ఉన్న రాహువును మ్రింగబోయాడు. అతడు భయంతో తప్పించుకొని పారిపోయాడు. ఇంద్రుని చేరి అతని లోక పరిపాలనలోని లోపాలను ఏకరువు పెడుతూ, ఏటికొక్కసారి, నోటికొక్కముద్ద నాకాహారంగా నియమించావు. అదీ నేడు నాకు దక్కకుండా వేరొకనిని నాపై తోలి, చోద్యం చూస్తున్నావు" అని ఆక్షేపించి, నెత్తీ నోరు మొత్తుకున్నాడు.

దానితో ఇంద్రునికి చిఱ్ఱెత్తుకొచ్చింది. ఆ కోపంలో ముందూ, వెనుక ఆలోచించకుండా ఐరావతాన్ని ఎక్కి వేగంగా వచ్చి ఆ బాలునిపై వజ్రాయుధాన్ని ప్రయోగించాడు. ఆ దెబ్బకు బాలుడు క్రిందపడి మూర్ఛబోయాడు. బుగ్గకు బాగా దెబ్బతగిలింది. అందువల్ల తర్వాత అతనిని హనుమంతుడన్నారు.

బిడ్డకు కలిగిన ఆపదను చూచిన తండ్రి వాయువుకు మిక్కిలి కోపంవచ్చింది. లోకాలన్నింటి నుండి తన రూపం ఉపసంహరించుకుని, బాలునెత్తుకొనిపోయి ఒక గుహలో చేరి జరిగిన దానికి విచారిస్తున్నాడు.

లోకములలో వాయువులేని జీవనం సాధ్యమా? ప్రాణులన్నీ స్థాణువులుగా మారిపోయాయి. ఋషులు, మునులు, దేవతలు, బ్రహ దగ్గఱకు పరుగుపెట్టారు. వారందఱితోగూడి, గుహకు దారి, బ్రహ్మ, ముందుగా ఆ బాలుని చేతితో నిమిరి, అతనిని చేతనునిగా చేసి, వాయువుని ప్రసన్నుని చేసుకున్నాడు. కారణజన్ముడైన ఆ బాలుని అభ్యుదయానికై తాను వరములిస్తూ దేవతలందరిచేత వరములిప్పించాడు. అందులో సూర్యుడు, ఇతనికి విద్యలు తానే నేర్పుతానని మాట ఇచ్చాడు.

## విద్యార్థి ఎలా ఉండాలి?

విద్ అనే ధాతువు నుండి ఏర్పడినది 'విద్య' అనే పదం. తెలియదగినది, జ్ఞానమని దాని అర్థం. విద్యను అర్థించేవాడు విద్యార్థి.

**లోకంలో విద్యలు రెండు రకాలు:**

1. బ్రతుకు తెరువుకు ఉపయోగపడే లౌకిక విద్యలు.

2. జీవితానంతరం, తిరిగి, పుట్టకుండా ఉండడానికి సహకరించే పారమార్థిక విద్యలు. అవి ఆత్మబోధ ద్వారా బ్రహ్మతత్త్వాన్ని ఎఱుక పరుస్తాయి.

ఇందులో 'బ్రహ్మవిద్య' చాలా కష్టం. అందుకనే లోకంలో సామాన్య విషయాలను గురించి ప్రస్తావిస్తూ "అదేం బ్రహ్మవిద్యా? రాకపోవడానికి" అంటూ ఉంటారు. అంటే, బ్రహ్మవిద్య అన్నింటికంటే విశిష్టమైనదన్న సంగతి నిజం. అది గురుముఖంగా ఉపదేశం పొంది సాధనల ద్వారా అనుభవానికి తెచ్చుకోవాలన్న మాట. **బ్ర.వే. తాడేపల్లి రాఘవనారాయణ శాస్త్రిగారు** పూరణ గావించిన తండ్రిగారి 'శ్రీరామకథామృతము" ఉత్తరకాండలోని హనుమచ్చరిత్ర ఒక ప్రత్యేక ప్రబంధము వలె సమగ్ర సుందరంగా తీర్చిదిద్దబడిన విధము సుమనోహరం. అందుకే కొందరు ఆ కథాభాగాన్ని ప్రత్యేక గ్రంథంగా ముద్రించి లోకానికి అందించారు.

రావణ వధానందరం అయోధ్యలో పట్టాభిషిక్తుడైన రాముని సమక్షంలో అగస్త్యుని నోట ఈ కథావిశేషం చెప్పించబడడం విశేషం. వాయుపుత్రుడు, సుగ్రీవమంత్రి అయిన హనుమంతుని ఉదంతాన్ని సమగ్రంగా చెప్పటం తనవంటి వాడికి సాధ్యమా? అని సందేహిస్తూనే ఆ మహావీరుని ప్రతాప రస ప్రవాహమే, తనకా శక్తినిస్తుందనే నమ్మకంతో ఆ పనికి పూనుకొన్నానని వినయంతో వివరించాడా అగస్త్యుడు. ఇందులో కవిగారి ఆత్మీయత చోటుచేసుకొనుట ప్రస్ఫుటము.

**ఎంతటివాడు పూనవలె నీ ప్లవగేశ్వరు మంత్రి సత్కథో**
**దంతయు విప్పి చెప్పఁ గలదా? అలదాక్ష్యము నన్ను బోటికిన్**
**వింతల మూలకందమగు వీని ప్రతాప రసప్రవాహమే**
**యంతకుఁ జాలి జాలుకొనునంచు దలంచి ధురన్ వహించితిన్.**



లంకలో రావణుని ప్రలోభములకు, రాక్షస స్త్రీల వత్తిడులకు లొంగని సీత, అతని ప్రగల్భవచనములకు బెదిరిపోయి తనకిక రక్షణలేదని నిరాశా, నిస్పృహలకులోనై ప్రాణపరిత్యాగంచేసిఉంటే రఘువంశము (రామ సుగ్రీవుల మైత్రి కారణంగా) వానర వంశము దుఃఖాలపాలై నశించటమే కాక కట్టె, కొట్టె, తెచ్చె అని చెప్పబడుతున్న సేతుబంధనం, రావణ సంహారం, సీతా పరిగ్రహణం జరిగిఉండేవి కావు, అంతటితో రామచరిత్ర అంతమైపోయేది. ప్రజలకు రామరాజ్యమే లభించేదికాదు.

లోక కంటకుడైన రావణుని సంహారమే జరుగకపోతే, ఆనాడు ధర్మ సంస్థాపన సాధ్యపడేది కాదు. సహనంతో కష్టాలకోర్చి సీత బ్రతికి ఉండటం వలన రామునితో కలిసి అయోధ్యలో తాను మహారాణిగా అభిషిక్తురాలు కావటమేకాక కుశలవులనుగని జగత్కల్యాణమునకు కారణమై విలసిల్లింది. ఇదంతా పరిశీలించినప్పుడు సీత చెప్పింది అక్షరాలా 'కల్యాణగాథ' అనేది నిజం.

ఆమెకు శోకాన్ని పోగొట్టి జీవితాశను కల్పించినవాడు హనుమంతుడు. సీతాన్వేషణలో ఇతరులు తనపై ఉంచిన విశ్వాసాన్ని వమ్ముకాకుండా చేయటం కోసమై అతడు కర్తవ్యనిష్ఠుడై తుదకు కృత కృత్యుడయ్యాడు.

తొలత లంకాపట్టణమంతా వెదికి సీతజాడ తెలియకపోవడంతో ఈ దుర్వార్త మోసుకొనిపోయి, తనవాఅందరికి దుఃఖం కలుగుజేయుటం ఇష్టంలేక, నిష్ప్రయోజనంగా బ్రతకటం కష్టమని, ఒక బలహీనమైన క్షణాన ఆత్మహత్య చేసుకొని అక్కడే మరణిద్దామని సంకల్పించినా, హనుమంతుడు మతిమంతుడు అయిన కారణంచేత తన వివేకంద్వారా ఆ నిర్వేదాన్ని అధిగమించి తన ప్రయత్నాన్ని సఫలత చేసుకోగలిగాడు. ఉత్సాహ పూరితమైన అతని కృషి లోకానికి ఆదర్శమై నిలిచింది. ప్రపంచానికి వెలుగుబాటను చూపింది.

ఆవేశాన్ని అదుపుచేసుకొని, తన అభిప్రాయం మార్చుకోవడం వల్ల కానీ, ఆసమయంలో మరొకరెవరైనా వెన్నుతట్టి సహనాన్ని, విశ్వాసాన్ని కలిగించి ఆపదనుండి తనను కాపడటంవల్లకానీ ఆ బలహీనమైన క్షణాలు గడిచిపోతాయి. ధైర్యంతెచ్చుకొని,

జ్ఞానాన్ని పెంపొందించుకొన్న ఆవ్యక్తి ఎన్నో మంచిపనులు సాధించి, సమాజంలో ఉన్నతుడవటమేకాకుండా, లోకానికెంతో మేలుచేయగల ఉత్తముడుగా కూడ కాగలుగుతాడు. ఆ తర్వాత అతనివల్లనే ప్రపంచానికి అనేక ప్రయోజనాలు సిద్ధిస్తాయి. జీవితాశను పెంపొందించే ఇట్టి విషయాలెన్నో ఉండటం చేతనే రామాయణం (సుందరకాండ)పారాయణ గ్రంథంగా ప్రసిద్ధికెక్కింది.

హక్కులేని పనిచేయటంద్వారా శిక్ష అనుభవించినట్లుగానే ఆత్మహత్యకు పూనుకోవటంవల్ల ఇహపరములు రెండింటిలోను శిక్షార్హులే అవుతారు.

“ఈ విధంగా ఆత్మహత్యాదోషాన్ని పరిహరిస్తూ, ధైర్యాన్ని కలుగజేస్తూ, అవరోధాలన్నింటిని అధిగమించి, జీవితంలో ఉన్నతశిఖరాలను అధిరోహించగల ఆత్మవిశ్వాసాన్ని చేకూర్చటంలో సమర్థవంతమై రామాయణం, సమాజ జీవన దర్పణంగా నిలిచి, కలకాలం వెలుగొందుతుంది” అనటం అతిశయోక్తి కాదు.

ఎట్టి పరిస్థితులలోను, ఏవిధమైన నిరాశా నిస్పృహలను దరిచేరనీయక స్వయంశక్తిని, అభ్యుదయ సాధనసంపత్తిని వృద్ధిపొందింపగల రామాయణమే నిజంగా కల్యాణ గాథ. ఇట్టి పవిత్ర చరిత్ర కీర్తించి, లోకానికందించిన వాల్మీకి మహర్షికి ముందుగా అభినందన మందారాలు-హరిచందనాలు-శతసహస్ర వందనాలు.

**కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్ ।**
**ఆరూహ్య కవితా శాఖాం, వందే వాల్మీకి కోకిలమ్ ॥**





తండ్రితపస్సుకు తనయులు వారసులౌతారు. తండ్రి బాగా గాయత్రిని అనుష్ఠించిన వాడైఉండి, బిడ్డకు ఉపదేశించాలి. అపుడే తండ్రిలోని శక్తి(జ్ఞానం) బిడ్డ(వటువు)కు ప్రసరిస్తుంది. గురువు శిష్యునకు మంత్రం ఉపదేశించినట్లు తండ్రి బిడ్డకు సవితృ సంబంధమైన జ్ఞానాన్నీ, (గాయత్రీ మంత్రాన్ని) ప్రసాదిస్తాడు. గాయత్రి, అనుష్ఠించేవారి బుద్ధి, శక్తులను జాగృతంచేసి ప్రకాశింపచేస్తుంది. అప్పుడతడు మేధావి, వర్చస్వి, తేజస్వి, యశస్వి అవుతాడు. నిండునూరేళ్లు హాయిగా సకల సంపన్నుడై వర్ధిల్లుతాడు. కేవలం వేడుకగా చేసుకొనేవారికి ఈ పరమార్థం లభించదు. వివాహానికి ముందు (30ఏళ్ళకు) ఉపనయన విధి చెయ్యాలి కనుక, చేయడంవలన వటుడు జపతపాలను చేసుకొనే అవకాశాన్ని కోలుపోతాడు. స్త్రీలకు ఉపనయనానికి బదులు వివాహమే విధించారు. మౌంజీ బంధనాదులు, ఉపాసనావిధులు అప్పుడే చెప్పబడ్డాయి. అగ్నిహోత్ర పరిరక్షణ మొదలైనవి ప్రారంభమౌతాయి. పతిని అనుసరించడమే వారికి తరణోపాయం. చిన్నతనంలో చేసిన నోములు, వ్రతాలు అభ్యుదయాన్ని చేకూరుస్తాయి. పురుషార్థాలతోపాటు మనోవ్యాకులతను పోగొట్టి ఏకాగ్రతను కలిగించి పరమార్థన్ని ప్రసాదిస్తాయి. ఉపనయనమైనవారు సంధ్యా వందనం చేయాలి. ఏడు(7)పూటల వరుసగా సంధ్యావందనం ఆచరింపలేకపోతే మరలా ఉపనయనం చేయవలసి వస్తుందని శాస్త్రం చెబుతోంది.

విప్రుడు వృక్షం, దానికిమూలం సంధ్య. మూలమే లేనపుడు పత్రములు లేవు, ఫలములూరావు. సంధ్యనుపాశించువారికి ఆయుర్దాయము, బలము, జ్ఞానము, యశము, ఆనందములు లభ్యములై బ్రహ్మవర్చస్సు సిద్ధిస్తుంది.

**విప్రోవృక్షః, మూలకాన్యత్రసంధ్యా, వేదశ్శాఖా, కర్మధర్మాణి పత్రమ్।**
**తస్మాన్మూలమ్, యత్నతో రక్షణీయమ్, భిన్నేమూలే, నైవ వృక్షో నశాఖా॥**



## ఉపనయన సంస్కారము

84 లక్షల జీవరాశులలో మానవజన్మ ఉత్తమమైనది. మానవులందరూ పుట్టుకతో సమానమే అయినా సంస్కారముల ద్వారా కొందరు ద్విజులవుతారు. అంటే రెండవ జన్మ కలవారౌతున్నారు. దానినే **కర్మణాజాయతే ద్విజః** అని పెద్దలు సూచించారు. ఈ సంస్కారకర్మలు జీవుని సంస్కరించి సద్బుద్ధిని ప్రసాదించి సత్కర్మాచరణమునకు దోహదం చేస్తాయి.

జీవులు, తల్లి గర్భంలో ప్రవేశించింది మొదలు, పుట్టి, పెరిగిన వారి శరీరం మసియై మట్టిలో కలిసేంతవరకూ క్రమంగా చేయదగినవి (16) షోడశ సంస్కారములు చెప్పబడినాయి. చిట్టచివరకు నిర్వహించే క్రతువుకు **అంత్యేష్టి** అని పేరు. స్త్రీ, పురుషభేదం శరీరానికే గానీ జీవికి లేదు. జీవి చైతన్య స్వరూపమే. ఆనంద మయమే, స్వీయకర్మలే సుఖ, దుఃఖ కారణాలు. ఆయా జీవుల కర్మఫలంగా శరీరం, విద్యాబుద్ధులు, ధనాదులు లభిస్తాయి. పుట్టుకకూడా తదనుగుణంగానే ఏర్పడుతుంది. యోగసాధకులైనవారు ఒక జన్మలో చేసిన కృషి(పని) ఫలించనపుడు జీర్ణమైన ఆ శరీరం పడిపోయినప్పటికీ, మరుజన్మలో పవిత్రులు, మహోన్నతులు అయినవారి కుటుంబంలో పుట్టి వారి ప్రోత్సాహంతో ఆ కృషి కొనసాగించి కృతార్థులౌతారు. **'శుచీనాం శ్రీమతాంగేహే యోగభ్రష్టోఽభిజాయతే'** అన్నది గీతాచార్యుని ప్రమాణవాక్యం. లోకంలో ఈనాడు దర్శనమిచ్చే బాల మేధావులందరూ పునర్జన్మ సిద్ధాంతానికి నిలువెత్తు నిదర్శనాలే.

అన్నింటికంటే ఉపనయన సంస్కారమన్నది పరమోత్కృష్టమైనది, జ్ఞానజన్మగా పేర్కొనబడింది. జీవులు తల్లిదండ్రులిచ్చిన శరీరంతోపాటు జ్ఞానంతో పరిపూర్ణమై, సన్మార్గంలో పయనించడానికి తగిన అర్హతను పొందుతారు. వేదశాస్త్రాదుల అధ్యయనానికి, ఉపాసనకు యోగ్యులౌతారు. ఉపనయనంలో తండ్రికి, బిడ్డకు తగిన తారాబలం చూచి, విశేషమైన గురుదృష్టి ఉండేవిధంగా లగ్న నిర్ణయం చేసుకోవాలి. నాలుగురోజులు అగ్నిహోత్రుని దీక్షగా ఉపాసించాలి. **"శ్రియమిచ్ఛేత్ హుతాశనాత్"** అగ్నిహోత్రుడు సిరులను, శుభములను కలుగచేస్తాడు. తండ్రిఆస్తికి బిడ్డలు వారసులైనట్లే



## మంచిమాట

లోకంలో ముఖప్రీతికై(ఇచ్ఛకములు) ఇష్టమైన మాటలు వినిపించేవారు చాలామంది ఉంటారు. వారు ఎప్పుడైనా ఎక్కడైనా సులభంగానే లభిస్తారు. అయితే, వింటానికి కష్టంగానే ఉన్నా, ఆచరణం ద్వారా మేలుచేకూర్చే మంచి మాటలు చెప్పేవారే అరుదు. ఒకవేళ ఎవరైనా సాహసించి హితము చెప్పినా, అది వినేవారూ లేరు.

**సులభాః పురుషా రాజన్! సతతం ప్రియవాదినః।**

**అప్రియస్యచ పథ్యస్య, వక్తా, శ్రోతాచ దుర్లభః॥**

రామాయణంలో చుప్పనాతి శూర్పణఖ చెప్పుడు మాటలు విని, రావణుడు దండకారణ్యంలో గల మారీచుని ఆశ్రమానికివచ్చి, సీతను అపహరించుకొని పోవటానికి తనకు సాయపడమని అతనిని కోరాడు. అందుకు మారీచుడు రావణునకు అది తగిన పనికాదని, సత్యపరాక్రముడైన రాముడు ధర్మస్వరూపుడు. అతని జోలికిపోవద్దని వివరించి, ఆ ప్రయత్నం మానుకోమని, చెప్తూ పైవిధంగా సమాధానం చెప్పాడు.

ఆ మంచి మాటలు రావణునికి నచ్చలేదు. అత డప్పుడు దౌర్జన్యంతో మారీచుని తన పనికి వినియోగించుకొని, కపటవేషంతో సీత,నపహరించాడు. ఫలితంగా పరివారంతోసహా పతనమైపోయాడు. వినాశోన్ముఖుడైన వారికి మంచి రుచింపదు కదా. అందుకే పెద్దలు వినదగునెవ్వరు చెప్పిన, వినినంతనే వేగపడక వివరింపందగున్, కని కల్ల నిజముదెలిసిన మనుజుడెపో నీతిపరుడు మహిలో సుమతీ!" అని ప్రబోధించారు. సుమతియై ఉండటమే అందుకు ముఖ్యమైన అర్హతగా ప్రకటించారు. బుద్ధిహీనులు, విచక్షణా రహితులు మంచివినరు. ఆచరించరు.

ఈనాడు సాహిత్య ప్రపంచానికీ ఇదే దుస్థితి సంభవించింది. బజారులో కుప్పలు తెప్పలుగా లభించే అశ్లీల, అసభ్య శృంగార రచనలు ప్రియంగా కన్పట్టి, ఆకర్షిస్తూ సమాజాన్ని అందులోనూ, యువతరాన్ని పెడత్రోవ పట్టిస్తున్నాయి. కామక్రోధాదులను రెచ్చగొట్టి, పగను, ద్వేషాన్ని రగుల్కొల్పి, మనుషులను రాక్షసులుగా చేస్తున్నాయి. నేరప్రవృత్తిని, ఇంద్రియ చాపల్యాన్ని ప్రోత్సహించి, బలహీనతలకు,

వ్యసనములకు లోనుచేస్తున్నాయి. అందుకు ఫలితమేమిటో వేరే చెప్పవలసిన అవలరంలేదు.

**తద్దివ్య మవ్యయం ధామ, సారస్వత ముపాస్మహే**
**యత్ప్రసాదాత్ప్రలీయన్తే, మోహాంధ తమసశ్చటాః!**

ఒక జాతియొక్క గొప్పతనం నిర్ణయించేటప్పుడు అక్కడ పుట్టిన సాహిత్యంయొక్క విలువలను కూడా పరిగణించటం జగమెరిగిన సత్యం. నేటిసమాజంలో ఏర్పడిన అస్తవ్యస్థ పరిస్థితులే ప్రత్యక్ష నిదర్శనాలుగా గోచరిస్తున్నాయి. దోపిడీలు, దొంగతనాలు దుష్కృత్యాలు, దౌర్జన్యాలు మితిమీరి పోయాయి. మాన, ప్రాణములకు రక్షణలేదు. ఆస్తి, పాస్తులకు భద్రతలేదు. ఆర్థిక సంక్షోభం, అప్పులబాధలు, ప్రతిక్షణం భయంతో బ్రతుకులు గడపటం జరుగుతోంది. అరాచకత్వం ప్రబలిపోయింది.

భారతీయ సంస్కృతి, మొదటి నుండి సమాజం సుఖశాంతులతో వర్ధిల్లటానికి తగిన సంస్కారయుక్తమైన సాహిత్యసంపదను అందించింది. ఇంద్రియనిగ్రహం ద్వారానే ధర్మాచరణం సాధ్యమవుతుందని చెప్పి, జీవితాన్ని సార్థకం చేసుకొనే మార్గాన్ని అందులో సూచించింది. "అసతోమా సద్గమయా, తమసోమా జ్యోతిర్గమయ, మృత్యోర్మా అమృతంగమయ". (తైత్తరీయోపనిషత్)

చెడునుండి మంచికి, చీకటినుండి వెలుగుకు, మృతినుండి అమృతత్వ మునకు చేర్చుమని ప్రార్థించటం పై మంత్రమునకు అర్థము.

"సహితమోః శబ్ధార్థయోః భావః సాహిత్యమ్" అనువ్యత్పత్తిని బట్టి హితముతో కూడిన రసమయమగు శబ్ధార్థసంపదయే సాహిత్యమని వివరించ బడింది. వ్యామోహమనే చీకట్లను పారద్రోలి విజ్ఞానజ్యోతులను వెలిగించే ఉత్తమ సాహిత్యం అధ్యయనం చేయడం మానవత్వ వికాసానికి, జాతిమనుగడకు దోహదపడుతుంది. భారతీయులు శబ్దజ్యోతినే సరస్వతీరూపంగా సంభావించారు. సత్యము, శాశ్వతము అయిన ఆ విజ్ఞానసముపార్జనమే సారస్వతోపాసనగా అభివర్ణించారు. ఆరాధించారు.



శరణాగతి పొంది లంకా సామ్రాజ్యమునకు అధిపతి అయినాడు. రావణ కుంభకర్ణులు వైరభక్తితో క్రమముగా జన్మాంతరములందు జయ విజయులై వైకుంఠమును చేరారు.

అలాగే రాముని స్మరించి గుర్తించి పూజించినవారిలో కబంధుడు, విరాధుడు మొదలగువారు తమ పూర్వరూపములను పొందారు. మహర్షులు స్వర్గసుఖముల కన్న శ్రీరామసందర్శన భాగ్యమే మిన్నయని తలపోశారు. రామకార్యమున హనుమకు తోడ్పడే ప్రయత్నంలో మైనాకుడు ఇంద్రునితో ప్రశంసింపబడి పరిపూర్ణమగు స్వేచ్ఛను అనుభవించాడు. ఉడుత, వారధి నిర్మాణంలో సాయపడి ధన్యత గడించింది. రాముని కొలిచి ఎందరోఉన్నతిని పొందారు. భంగపడ్డవారు లేరు.

"రామోవిగ్రహవాన్ ధర్మః" శ్రీరాముడు ధర్మస్వరూపుడు. న్యాయ మార్గమును అనుసరించినవాడు. కనుకనే పశుపక్షాదులు కూడా రామునికి సహకరించాయి. దుర్వృత్తముతో అపమార్గముననుసరించిన రావణుని, రక్తము పంచుకొని పుట్టిన సోదరుడు విభీషణుడు విడిచిపోయి ధర్మమునాశ్రయించాడు. ఈ విషయమునే కవులు చక్కగా ఈ విధంగా వర్ణించారు. ఇదియే రామకథాసారము

**శ్లో॥ యాన్తి న్యాయ ప్రవృత్తస్య తిర్యఞ్చోఽపి సహాయతాం।**
**అపంథానంతు గచ్ఛతం సోదరోఽపి విముంచతి॥**

శ్రీరాముడు మహాప్రస్థానమున తనను అనుసరించిన వారందరికి మోక్షమును కలిగించాడు. రామనామము ఎల్లకాలములందును, సర్వులను పునీతులను చేయుచున్నది.

**"శ్రీరామ జయరామ జయజయ రామరామ"** అనునది జయమంత్రము. అందరూ అన్ని వేళలా భజింపదగిన శుభనామము.

**శ్రీరామచంద్రః శ్రితపారిజాతః సమస్త కళ్యాణ గుణాభిరామః।**
**సీతాముఖాంభోరుహ చంచరీకః నిరంతరం మంగళమాతనోతు॥**

## శ్రీరామ కథామృతం

లోకమున శ్రీరాముని కథ అమృతోపమానము. అవును అమృతమే. దానికి ఎప్పటికి క్షతిలేదు. ఈ భూమి మీద పర్వతములు నిలిచి ఉండునంత వరకు, నదులు ప్రవహించు నంతవరకు రామకథ ప్రచారమున ఉండునని స్వయంగా ఆ బ్రహ్మదేవుడే చెప్పాడు.

**శ్లో॥ యావత్స్థాస్యంతి గిరియఃసరితశ్చమహీతలే!**
**తావద్రామాయణ కథా లోకేషు ప్రచలిష్యతి!!**

ఆ కథలోని సహజ సౌందర్యమే పఠితలను ఆకర్షించి మాధుర్యమును అనుభవింపచేసి ఆనందమును కలిగిస్తుంది. అందువలన ఆ కథయే స్వయంగా ఒక కావ్యమై ప్రవర్ధిల్లింది. ఈ కథ వ్రాయబూనిన వారెల్లా కవులుగానే చెలామణీ అవుతున్నారని **"సాకేత"** గ్రంధమున **"మైథిలీ శరణగుప్త"** అను రచయిత సంభావించారు.

**"రామఃసత్యపరాక్రమః"** సత్య పరాక్రముడైన రాముడు సుగుణాభిరాముడై లోకమునకు ఆరాధ్యుడైనాడు. రామ సాంగత్యమున వికృతులు పోయి, జీవులు ప్రకృతిస్థులు కాగలరు అనునది రామకథా సారము. గమనిస్తే మనకు తెలుస్తుంది.

విశ్వామిత్రుడు యాగమును పరిసమాప్తి గావించుకొని కృతార్థుడైనాడు. రాముని చేతిలో మరణించిన తాటకి తన రాక్షసత్వమును వీడి యక్షకాంత అయినది. అహల్య రామ పాదస్పర్శచే శిలా రూపమును వీడి, తనపతిని చేరినది. గుహుడు రామపాదములు కడిగి శిరస్సున దాల్చి ధన్యుడైనాడు. భక్తితో పండ్లు తినిపించి, శబరి మోక్షమును పొందింది. సేవచేసిన పక్షి జటాయువు రామానుగ్రహమును పొంది ఉత్తమ లోకములకు వెడలినాడు. సంపాతి వానరుల వలన రామకథను విని, పోయిన రెక్కలను తిరిగి పొందాడు. సుగ్రీవుడు రామునితో మైత్రిపాటించి రాజ్యభోగములను అనుభవించాడు. హనుమంతుడు రామసేవా ధురంధరుడై సీతామాత అనుగ్రహపాత్రుడై లోకులచే పూజలందుకుంటున్నాడు. విభీషణుడు రాముని



## నీటి కొలది తామర

తామర (పద్మము) చెరువులోనున్న నీటినిబట్టి అది వికసిస్తుంది. నీరు, నిండుగా ఉన్నప్పుడు, అడుగంటినప్పుడు కూడా అది దర్శనమిస్తుంది. పరిమళాన్ని పంచుతుంది. ఆనందాన్ని అందిస్తుంది. చెరువుయొక్క విస్తీర్ణాన్ని, లోతును బట్టి కాకుండ, నీటినిబట్టి మాత్రమే అది ప్రవర్తిస్తుంది. ఆవిధంగానే, భక్తులయొక్క పేద, ధనిక భావాన్నిగాని, పండిత, పామరత్వాన్నిగాని పరిగణింపక కేవలం వారి భక్తిని ప్రమాణంగా తీసుకొని అనుగ్రహిస్తాడు భగవంతుడు. ఎక్కువ, తక్కువలు భక్తిలోనే ఇతర విషయాలలో ఉండవు. స్త్రీ, పురుష భేదాలు, కులము, వయస్సు లెక్కలోకిరావు. "గోవిందుడు అందరివాడే" అన్న పెద్దలమాటకర్థం ఇదే. పరమేశ్వరానుగ్రహ పాత్రులగుటకు మానవులకేగాక పశు, పక్షిగణములకు కూడా అర్హత ఉన్నది. జీవుల ఉపాధి ఎన్నడూ పరిగణలోనికిరాదు. భక్తి ఒక్కటేముఖ్యం. ఆభక్తి మోక్షసాధన సామగ్రిలో మిక్కిలి అధికమైనదిగా అనుభవజ్ఞులు బోధించారు. మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవగరీయసీ! (నారదభక్తి సూత్రాలు).



## శ్రీకాళహస్తి

శ్రీకాళహస్తిలో, శ్రీ = సాలెపురుగు, కాళ = పాము, హస్తి = ఏనుగు, చేసిన భక్తికిమెచ్చి పరమేశ్వరుడు వాటికి మోక్షమివ్వటమే కాక తాను ఆమూడింటి రూపాన్ని ధరించి సర్వస్వారుణబుద్ధితో వాటిని భక్తకోటికి ఆదర్శంగా నిలిపాడు. జరిగిన సంఘటనకు ప్రత్యక్షసాక్షియైవెలసాడు అయ్యప్పదీక్ష తీసుకొన్న భక్తులు అయ్యప్పలై స్వామికి ప్రతీకలై పూజలందుకొంటున్నారంటే అది ఆ భగవంతుని దివ్యానుగ్రహం" అనటంలో సందేహం లేదు.



# భక్తుని కొఱకు భగవంతుడు

భూదేవికి వడ్డాణంవలె ప్రకాశించే పట్టణం కంచి. దాన్నే 'కాంచీపురం' అంటారు. అది పుణ్యభూమి. పుణ్యాత్ములెందఱో ఉన్న తపోభూమి. 'నడిచేదేవుడి'గా ప్రసిద్ధిపొందిన కంచి పీఠాధిపతులు, పరమాచార్య శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీస్వామి నడయాడిన పవిత్రభూమి. శ్రీ కామాక్షీ, ఏకామ్రేశ్వరులు, శ్రీమహాలక్ష్మీ వరదరాజస్వాములు కొలువున్న దివ్యభూమి.

ఒకప్పుడు ఆ పట్టణంలో 'చిఱుతొండనంబి' అనే శివభక్తుడొక డుండేవాడు. అతడొక వ్రతం పట్టాడు. ఆ నియమాన్ని బట్టి, శివభక్తులు ఎందఱు, ఎప్పుడు ఇంటికి వచ్చినా, ఆదరంతో వారికి తగిన భోజనాదికములు చేకూర్చి అడిగిన కోర్కెలు కాదనకుండా తీర్చేవాడు.

ఒకనాడు శివయోగి (దీక్షాపరుడు) ఒకడు అతని ఇంటికివచ్చి, నేడు శివుని అభిషేకించుటకు తూమెడు చెరుకురసం కావాలని, అది చిరుతొండనంబిని తెమ్మని కోరాడు. అది తన గురువుచెప్పిన నియమంగా తాను పాటిస్తున్నానని అన్నాడు. నిత్యం శివాభిషేకం చేయనిదే తాను భుజింపనని వివరించాడు.

అప్పుడా(నంబి) భక్తుడు చెఱుకుతోటకుపోయి, మంచిరసము గల నూరుగడలుకొని, కట్టకట్టుకొని, ఆమోపు నెత్తిపైకెత్తుకొను ప్రయత్నంలో శక్తిచాలక తాను ముందుకు మొగ్గ తిలబడ్డాడు.

పట్టుదలతో, మరల ఎత్తుకొనబోవునప్పుడెవ్వరో తోడుపడినట్లు తనతో, మోపు మోసినట్లు తోచింది. ఇంటికిచేరి, మోపు నేలపై పడవైచి వెనుదిరిగి చూచునంతలో ఇంతవఱకు తనతోడుగా నున్నవాడు కానరాలేదు.

ఆ బరువుమోసిన చిఱుతొండనంబికి శరీరము చెమటపట్టింది. భగవంతుడైనను, శివునకు కూడ శరీరము చెమర్చింది. భక్తుడెట్టి అవస్థననుభవించునో భగవంతుడాస్థితిని పొందుట భగవల్లీలా విశేషము. అతడు సుఖించిన సుఖము, శ్రమించిన శ్రమయుననుభవించును. భగవంతుని ఆర్ద్రతకిది దర్శనము. "జీవో బ్రహ్మైవనాఽ పరః". అనిర్వచనీయమైన అద్వైతస్థితియది.



**శ్రీరాఘవనారాయణ శాస్త్రిగారు** బహుముఖ ప్రజ్ఞాశాలి. వారి ప్రతిభా వైభవమునకు మూలమైనది వారి ఉపాసనాక్రమము. విశేషమైన అనుష్ఠాన విధానము. వైశ్వదేవము జేసి, 60 సంవత్సరాలు నిర్విఘ్నముగా, సకాలంలో అగ్నిని ఉపాసించిన కర్మిష్ఠులు. వేదవేత్తలు. శాస్త్రిగారు విద్యాభ్యాసము పూర్తిచేసుకుని తమ 19వ యేటనే తండ్రిగారు ప్రారంభించి, నిర్వహించుచున్న **'శంకర సంస్కృత పాఠశాల'**లో (చందోలు) పాఠప్రవచనాదులను చేయుచూ తండ్రిగారికి చేదోడు వాదోడుగా నుండి, తదనంతరం జీవితాంతం అచటనే విద్యార్థులకు జ్ఞానభిక్షపెట్టి తండ్రిగారి ఆశయము నెరవేర్చినారు. ఆ స్థల మహాత్మ్యము, శాస్త్రిగారి సంకల్ప బలముననుసరించి ఇప్పటికిని ఆ చందోలులో శాస్త్రిగారి పేరుతో వేదసంస్కృతపాఠశాల నిర్వహింపబడుచున్నది.

శాస్త్రిగారి తమ్ముని కుమారులు బ్ర॥శ్రీ॥ వేదమూర్తులు తాడేపల్లి లక్ష్మీధర సోమయాజులుగారు ఆబరువు బాధ్యతలు వహించుచూ వేదవిద్యా ప్రచార కార్యక్రమము నెరపుచున్నారు. శ్రీ శాస్త్రిగారు ధర్మకర్మ దీక్షా పరతంత్రులు. వీరి తపస్సాధనా ఫలమున వీరి వారసులు మరియు వీరి శిష్యగణము బహుముఖముగా ప్రసిద్ధులై సమాజహితులైయున్నారు. శాస్త్రిగారి శ్రీదత్తభాగవతమును **శ్రీ నోరి భోగేశ్వర శర్మగారు** పరిశోధించి పి. హెచ్.డి. పట్టా పొందారు. వీరి తండ్రిగారి **'శ్రీరామకథాఽమృతము'**ను ఈవ్యాసరచయిత **"శ్రీరామకథాఽమృతము – సమగ్ర సమీక్ష"** అను అంశముతో గ్రంథపరిశోధన గావించి ఏ.యూ. నుండి 1985లో పి. హెచ్.డి పట్టాను పొంది ఉన్నాడు. శాస్త్రిగారి ఆధ్యాత్మిక సాధన దాన, దయాధర్మములు పదుగురకు భుక్తి ముక్తులకు కారణమైనదనుటలో సందేహమే లేదు. సర్వజన సమభావులైన వీరు సదా సర్వులకు ఆదర్శప్రాయులు. ఉదాచరితులైన ఇట్టివారినే, వసుదైక కుటుంబకు'లు అని పరిగణిస్తారు. తన, మన భేదం అల్పబుద్ధుల లక్షణం. అది వీరికి లేదు.



# వసుధైక కుటుంబం

శతావధానులు, **బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవనారాయణ శాస్త్రి (చందోలు శాస్త్రి)గారు** ప్రతిభావంతులైన సాహిత్యవేత్తలు. భాష్యాంత వైయా కరుణులు. బ్రహ్మజ్ఞాన సంపన్నులు, యోగి పుంగవులుగా ప్రసిద్ధులు. ఆధ్మాత్మ సుందరములైన వారి గ్రంథములన్నియూ అందుకు ప్రత్యక్షర సాక్ష్యములే. వారి తండ్రిగారు బ్ర॥వే॥ వేంకటప్పయ్య శాస్త్రిగారు వ్రాసిన **"శ్రీరామకథాఽమృతము"** ఉత్తర కాండలో ఆరు వేల పద్యములు పైగా రచించి, గ్రంథ పరిపూర్ణతకు కృషిచేసి విశేష వ్యయ ప్రయాసలకోర్చి, గ్రంథమును ముద్రింపించి, లోకమునకు అందించారు. **శ్రీరాఘవనారాయణ శాస్త్రిగారి** స్వీయ రచనలలో **"దత్త భాగవతము"** మిక్కిలి ప్రసిద్ధము. వారు **'కళ్యాణకైవర్తకము'** అను శివలీలా వైభవమును వర్ణించు ప్రబంధము, 'మధురావిజయము' అను చారిత్రక పద్యకావ్యము. **'మత్ స్వప్నః'** అను సంస్కృత కావ్యము మరియు **'యమావిక'** అను తీర్థయాత్రా విశేషములను తెల్పునది మరియు అనేక గ్రంథములు రచించారు. వీరు ఆధ్యాత్మిక కళావతంసులు.

**శ్రీ రాఘవ నారాయణ శాస్త్రి** గారికి భారతీయ సంస్కృతి, సంప్రదాయాలకు పట్టుగొమ్మలు అయిన రామాయణ, భారత, భాగవతాది పురాణములు విశేషముగా కంఠోపాఠములు. వారి ప్రసంగములలో ధర్మ సంబంధమైన ఆయా విషయములు విపులముగా వివరించబడుచుండెడివి. వీరు బాపట్లలో చేసిన ప్రసంగములు వ్యాసములుగా రూపొందించబడి **'నాకు తోచిన మాట'**గా ముద్రించబడినవి. వాస్తు జ్యోతిష్యాది పెక్కు శాస్త్రములలో వారు అసాధారణ పండితులు. లోకమున వారొక విజ్ఞాన సర్వస్వముగా కీర్తింపబడినారు. వారి దౌహిత్రులు డాక్టర్ చెరువు సత్యనారాయణశాస్త్రిగారు **'శ్రీరామకథాఽమృత కవి కుమార చరితము'** వ్రాసి వీరి జీవిత విశేషములు కొన్ని దానిలో వివరించారు. **బ్రహ్మశ్రీ మేళ్ళచెరువు సుబ్రహ్మణ్య శాస్త్రిగారు "చందోలు మహర్షులు"** అను పేరుతో ఆ పితాపుత్రుల దివ్యజీవనము రచించారు.



అదే సమయమున శివుడు, కైలాసమున సకలదేవతలు తనను సేవించుచుండ పార్వతితోగూడి కొలువుదీరి యుండెను. గంధర్వులు గానము చేయుచుండ అప్సరసలు నాట్యమాడుచుండిరి. శివుని శరీరము చెమర్చుట గమనించిన పార్వతి, ఆటలాడు దేవకాంతలను చూచియే యిట్లు చెమర్చితివా? అని అడుగ శివుడు, చిఱుతొండనంబి వృత్తాంతమునుజెప్పి, కారణము వివరించెను. అప్పుడా పార్వతి, నీయనుగ్రహమున కంతగా పాత్రుడైన, ఆ భక్తుని చూడవలెనని పట్టుపట్టింది. ముందుగా ఈశ్వరుడందుకు తగిన వాతావరణాన్ని సృష్టించాడు.

వృద్ధ దంపతుల వేషంలో శివపార్వతులు కంచి, కేతెంచి, భక్తుని పరీక్షించి, ఆతని వ్రతనిష్ఠకు మెచ్చుకొని, ఆతనితోబాటు, ఆతని బంధువులకు కూడ మోక్షమొసంగి, రక్షించెను. ఇది హరవిలాసములోని(1,2 .ఆ.) మొదటి కథాసారము. శ్రీనాథమహాకవి దీనిని తెలుగులో రచించి, అవచి తిప్పయశెట్టికి అంకితమిచ్చాడు. ఇందులోని పద్యములు మధురములు, మనోహరములు. శ్రీనాథునియుపజ్ఞకివి నిదర్శనములు. చిఱుతొండనంబి కుమారుడు, సిరియాళుడు. అతనిని పరీక్షింప వచ్చిన మాయజోగితో "పరార్థమైతనూధనము వ్యయింపఁగల్గుట కదా! జననైకఫలం బెఱింగినన్" అని చెప్పి, పరమేశ్వరార్పణ బుద్ధితో ఇచ్చినది పరమార్థమై పరతత్త్వయోగ ఘటనాపరమగునని పలికి, ఆశ్చర్యపరచినాడు.

**ఎఱుకచాలనివాఁడందమే దధీచి,**
**నల్పబుద్ధులె మేఘవాహనుడు, శిబియు**
**ధరఁ "బరోపకారార్థమిదంశరీర"**
**మనెడు వాక్యంబు వినమె సంయమివరేణ్య!**

**అధ్రువంబైన, మలభాండమైన దేహ,**
**మనఘ! యన్యోపకారార్థమై వ్యయించి**
**ప్రవిమలంబుఁగల్పాంతరధ్రువమునైన**
**కీర్తి కాయంబుఁగైకొంటకార్తియేల?**

వేదములు, ప్రభుసమ్మితములు; పురాణములు, మిత్ర సమ్మితములు. కావ్యములు కాంతాసమ్మితములు. కావున ధర్మమును, జీవిత పరమార్ధమును, అలవరుచుకొనవలసిన సంస్కారమును సాహిత్యము ద్వారా తెలియజేశారు మన కవులు. 'సాహిత్యము' అంటేనే హితముతో కూడినదని అర్ధము. ఇదియే తెలియదగిన పరమార్థము.



## అందరి బ్రతుకులు బాగుండాలి

పాండ్యదేశంలో సత్కీరుడనే కవి పండితుడు. అతడు శివుని శాపానికి గురియై, శాప విమోచనమునకు తనను హిమాలయాల్లో ఉన్న కైలాస శిఖరానికి రావలసిందిగా ఆజ్ఞాపించాడనే ఊహతో, తానున్న ప్రదేశం నుండి దుర్గమ మార్గంలో ప్రయాణించసాగాడు. మధ్యలో అనేక పుణ్యతీర్థ క్షేత్రాలను సందర్శిస్తూ వెళ్తున్నాడు.

మార్గమధ్యంలో ఓ అరణ్యం వచ్చింది. అక్కడ కన్పించిన ఓ చెట్టునీడలో కూర్చొని సేద తీర్చుకుంటున్నాడు. విచిత్రంగా ఆచెట్టు ఎండుటాకులు, చెట్టు పక్కనున్న నీళ్ళలో పడితే చేపలూ తాబేళ్లుగానూ, నేలమీద పడితే పక్షులుగానూ మారిపోసాగాయి. ఆశ్చర్యపడిన నత్కీరుడు దీనిక్కారణమేమిటా? అని అలోచిస్తున్నంతలో ఓ బ్రహ్మరాక్షసుడు తనని పట్టుకునిపోయి ఓ కొండ గుహలోనికి నెట్టి బంధించేసాడు.

అక్కడ మరో 99మంది తనలాగానే బందీలై ఉన్నారు. వాళ్లంతా – "నీరాక కోసమే ఎదురుచూస్తున్నాం. ఈ బ్రహ్మరాక్షసుడు మహా బలిష్ఠుడూ తిండిపోతూ అనీ, మనుష్యశరీరాలే వాడికాహారమనీ చెప్తూ, నీ రాకతో నూరుగురు పూర్తయ్యారు కాబట్టి మనకు నూరేండ్లు నిండాయి, మరణం తథ్యమని అన్నారు.

నూరుగురు మనుష్యుల శరీరం వాడికి ఓ ఆహారపు ముద్ద కాబట్టి మనకిక జీవితంమీద ఆశలేదని, వద్దనీ అన్నారు. సత్కీరుడు వెంటనే తనకి ఉపాస్యదైవమైన స్వామి సుబ్రహ్మణ్యణ్ణి ఇలా స్తుతించాడు అందరి పక్షానా.



తమ ఉత్తమ వ్యక్తిత్వాన్ని విడువకుండా కాపాడుకొంటారు. వారే సమాజానికి ఆదర్శంగా నిలచిఉంటారు. అటువంటివారితో స్నేహం చేయటానికి ప్రయత్నించాలి.

తనకంటే తక్కువవాళ్ళు, తనతో సమానులు, తనకంటే అధికులు ఎప్పుడూ ఉంటూనే ఉంటారు. హీనులతో స్నేహంచేస్తే బుద్ధిహీనంగానే ఉంటుంది. వీరినే అల్పబుద్ధులు అంటారు. వీరితో ప్రమాదాలు వస్తాయి. సములతో స్నేహం చేస్తే బుద్ధి ఎదుగుబొదుగులు లేకుండా సమంగానే ఉంటుంది. ఉత్తములతో స్నేహంచేస్తే బుద్ధి ఉత్తమంగా పరిణతి చెందుతుంది. అందువల్ల మనం ఎప్పుడూ ఉత్తములయిన వారితోనే స్నేహం చేయాలి. అందువల్ల అనేక ప్రయోజనాలుంటాయి. జ్ఞానం వృద్ధి చెందుతుంది. జన్మ రాహిత్యానికి, మోక్షానికి మార్గం సుగమమవుతుంది.

**శ్లో॥ హీయతేహి, మతిస్తాత, హీనై స్సహ సమాగమాత్।**
**సమైశ్చ సమతా మేతి, విశిష్టైశ్చ విశిష్టతామ్॥**



# సంసర్గము

శ్లో॥ గుణవద్వస్తు సంసర్గాత్, యాతినీచోஉపి గౌరవమ్।

పుష్పమాలాను షంగేణ, సూత్రం శిరసి ధారయేత్॥

గౌరవం గల, గొప్పగా మంచి వారితో కలసిన సామాన్యులకు కూడా గొప్ప గౌరవం లభిస్తుంది. దారం, పువ్వులతో చేరినప్పుడు శిరస్సున ధరింపబడుతుంది. పరమేశ్వరుని పాదపద్మములను అలంకరిస్తుంది. దారం విడిగా ఉన్నప్పుడు ఊడ్చి చెత్తకుప్పలో పారేస్తాం. (సంసర్గమంటే కూడుట, చేరుట అని అర్థం. సత్సంగం అన్నది పర్యాయపదంగా చెప్పవచ్చు. బుద్ధిలో పెద్దవారితో స్నేహం చేయటం అని అర్థం.)

నేటి బాలలే, రేపటి పౌరులు కదా! సంరక్షులైన తల్లి తండ్రులు వారిని పట్టించుకొని విద్యలో పరిణతి సాధించేలా ప్రయత్నం చేయాలి. డబ్బులు వెచ్చించి వనమహోత్సవాలు నిర్వహించటం వెంటనే ఎవరిత్రోవన వారు వెళ్లిపోతే నాటినచెట్లు వనంగా పెరిగేదెలా? కన్నబిడ్డలకన్నా మిన్నగా కాపాడుకోవాలి. నీరు పోయాలి, చీడపీడలు పట్టి నాశనం కాకుండా సంరక్షించుకొన్నపుడే ఆశా, ఆశయం నెఱవేరుతుంది. తలచిన ప్రయోజనం చేకూరుతుంది. చెడుస్నేహాలు చీడపీడలు వంటివి వాటిని వదిలించాలి. కలుపు మొక్కలను తొలగిస్తేనే పైరు ఏపుగా పెరుగుతుందనేది అనుభవ సత్యం. కంచయే చేనుమేసినట్లు విద్యా సంస్థలే విద్యార్థులను మత్తులో తూగాడైలా చేస్తున్నాయి.

అంతటా అటువంటి వాతావరణమే ఉంటుందని గాని, అందరూ అటువంటివాళ్లే ఉంటారని భయపడాల్సిన అవసరం లేదు. పరిస్థితులు ఎప్పటికప్పుడు గమనించుకొంటూ ముందుకు వెళ్ళటమే కర్తవ్యం. అదే విజ్ఞత అనిపించుకొంటుంది.

**'పరివేష్టితైః మహాసర్పైః చందనం న విషాయతే'**

మలయపర్వతంలో ఉన్న చందన వృక్షాలు విషసర్పాలతో చుట్టబడి ఉన్నప్పటికీ, అవి తమ చల్లతనాన్ని, పరిమళాన్ని విడిచిపెట్టవు. ఆ విధంగానే కొందఱు



**ఉ॥ తారకదైత్యభంజనుడు, దారుణశక్తియుతుండు, పన్నగా**

**హారహయుండు, దీన జనతామర భూజము, షణ్ముఖాట్టహా**

**సారభటీ-విపాటిత దిగంతకటాహుఁడు, వీనిబట్టి సం**

**హారమొనర్చి యిందఱఁగృపామతియై బ్రతికించుగావుతన్.**

ఒక వ్యక్తికి భగవంతుని మీద ఉండే భక్తివిశ్వాసాలే అతణ్ణి నిరంతరం రక్షిస్తూ ఉంటాయి. తనతోబాటు తనతోఉన్నవారిని కూడా బ్రతికించమని కోరటంలో ఆభక్తుని ఔదార్యం వ్యక్తమవుతుంది. కాబట్టి నత్కీరుని శివభక్తి అతణ్ణి రక్షించిందని ఈ కథ మనకి చెప్తూంది. ఈ విషయాన్నే ఈ క్రింది పద్యం ఇలా వివరిస్తుంది.

**ఉదా॥ భూతము ఁ జంపుటే యరుదు, బోరన తారకుమన్నిగొన్నవి**

**ఖ్యాతమహాప్రతాపునకు; నద్రిగుహాలయమేమి దొడ్డు, ని**

**ర్ఘాతమువంటి శక్తిగొని క్రౌంచముద్రుంచిన రౌద్రమూర్తికిన్;**

**భీతిఁ దొలంగ ఁజేయుటొకవింతయె? వారిత దైవతార్తికిన్:**

కథలో, సత్కీరుడు, సుబ్రహ్మణ్యస్వామి భక్తునిగా వర్ణించిన ధూర్జటి మహాకవి కూడా, స్వామి భక్తుడు-ఆ మంత్ర ధ్యాన విశేషములు ఇక్కడ వివరింపబడ్డాయి - కవి ఆత్మీయతకిది అద్దంపడుతోంది.



## రామ నారాయణుడు

తాడేపల్లి వారి 'శ్రీరామ కథాఽమృతము' బాలకాండలో శ్రీ వేంకటప్పయ్య శాస్త్రిగారు బాలరాముని వర్ణించిన తీరు మనోహరం. ఇందులో శివుడు, పార్వతికి ఈ రామకథ చెప్పినట్లు వివరించడంలో ఆధ్యాత్మ రామాయణ ప్రభావం కనబడుతోంది.

లోకంలో, చిన్న పిల్లలకు పాలబుగ్గలుండటం సహజం. అది, ఇతడు పాలసముద్రంలో పవళించేవాడుగా తెలియజేస్తోందని చెప్పటం కవి చమత్కారం. స్వభావోక్తి సుందరం. అలాగే, పసిబిడ్డల శరీరం మెత్తగా ఉండటం గమనిస్తాం. అది ఇతడు పాపసెజ్జ (శేషుని)పై నిదురించేవాడనే విషయాన్ని వివరిస్తోందనడం విశేషం.

సహజంగా పిల్లలకు కాటుక పెట్టడం వలన పెద్దవిగా కనబడే అందమైన కన్నులుండటం చూస్తూ ఉంటాం. అయితే ఇక్కడ కవి అతడు కమలాక్షుడు (పద్మముల వంటి విశాలమైన కన్నులు కలవాడు) అనే సంగతి బోధ చేస్తోందని చెప్పటం ఉక్తివైచిత్రి. కమలనాభుడంటే విష్ణువని లోకంలో ప్రసిద్ధి.

పసిపిల్లలకు, క్రొత్తకాంతితో నిండి ఆకర్షణీయమైన మెఱిసే కళ్ళు ఉండటం అనుభవంలో ఉన్న విషయం. కానీ, ఈ సుకుమారుడు 'శ్రీనివాసుడు'. లక్ష్మికి (కాంతికి) నివాసమైన వాడుగా నిరూపిస్తోందని చెప్పటం సుందరమైన వ్యక్తీకరణ.

సమ విభక్తములైన అవయవముల కూర్పు ఈ బాలుని 'విశ్వ మోహనుని'గా తలపింపజేస్తోంది. ఇతడు పురుషోత్తముడు, విష్ణువు. విశిష్టుడైన వానిని ఏ రూపంలో, ఏ వేషంలో ఉన్నా గుర్తించడం సులభమే అని చెప్పిన సర్వజ్ఞుడైన శివుని మాటలు విని, పార్వతి ఆ రామనారాయణుని చూచి సంతోషంతో తరలనయన అయినదట.

నారాయణుడు, నరుడుగా పుట్టి రావణ సంహారంచేయటం రామావతార ప్రయోజనం. శ్రీరామకథాఽమృత కర్తలా రహస్యాన్ని శివునినోట పలికించడం వారి విజ్ఞతకు నిదర్శనం. కావ్య నిర్మాణశిల్పంలో అది ఒక భాగం.



సిద్ధిస్తాయి. వ్యాస భగవానుడు రచించిన అష్టాదశ పురాణములలో, 'బ్రహ్మాండ పురాణము, శ్రీదేవీవైభవాన్ని విపులంగా వర్ణించింది.

దుష్టశిక్షణ, శిష్టరక్షణ, ధర్మసంస్థాపన ప్రధాన లక్ష్యములుగా భగవదవతారము ఏర్పడుతుంది. భండాసురాది రాక్షసులు సృష్టిధర్మమును భంగపరస్తూ దేవతలను, మునులను, సాధువులను, సజ్జనులను బాధించడం క్రతు వ్రతములను భంగంచేయటం మొదలైన దుశ్చర్యలు చేస్తూ లోకకంటకుడై ప్రవర్తిస్తున్నాడు. దేవతలు, మహర్షులా దుస్థితిని దేవికి విన్నవించి, తమను కాపాడమని ప్రార్థించారు. అప్పుడా జగజ్జనని వారు హోమం చేసే యజ్ఞకుండం నుండి ఉద్భవించి, శక్తి సేనలను వెంటపెట్టుకొని ముల్లోకములను పీడించే భండాసురుని సపరివారంగా సంహరించింది.

జీవులు తామాచరించిన పుణ్యపాప ఫలములను అనుభవించటానికి పుడతారు. ఆ విశ్వమాత, దేవకార్యాన్ని నిర్వర్తించటం కొఱకు ఆవిర్భవించింది. జీవులను ఉద్ధరించటానికి దైవము, అనేక అవకాశములను కల్పిస్తుంది. సద్వినియోగం చేసుకొనుట మన విధి. కృత, త్రేతా, ద్వాపర యుగములలో కఠోరమైన తపస్సు, యోగము, యజ్ఞ, యాగ నిర్వహణము మొదలైనవి పాటించారు. కలియుగ మానవులకు అంతటి శక్తి చాలదు కనుక, 'నామపారాయణ' మాత్రం చేతనే సంతుష్టురాలై, సకల శుభములను ప్రసాదించి కాపాడుతుంది. ఈసత్యమును గ్రహించి 'అమ్మ' అనుగ్రహానికి పాత్రులమవుదాం.

--- స్వస్తి ---



"లీలా కల్పిత బ్రహ్మాండమండలా" అన్నది వశిన్యాదివాగ్దేవతల వచనము. అందులో బ్రహ్మాదుల నుండి చీమలు, దోమలు వరకుగల జీవులన్నీ వారి సంతానమే.

యుగములు, కల్పములు గడిచిన తర్వాత జరిగే ప్రళయంలో, సృష్టిఅంతా తనలో లయమైపోగా, మహేశ్వరుడు చేసే తాండవమునకు 'సాక్షి' లలితాంబ, అంటే వారు, ఈసృష్టికి ముందున్నారు. తర్వాత కూడా ఉండేది వారే. వారిరువురూ వేరుకాదు. ఒక్కరే చంద్రునకు, వెన్నెలకు భేదములేనట్లు వారిరువురికి భేదములేదు. వారు ఒకరిని విడిచి ఒకరులేరు.

**నశివేనవినాదేవి. దేవ్యాచన వినాశివః**
**ఉభయోరంతరంనాస్తి, చంద్రచంద్రికయోరివ॥**

అనఘము, అద్భుత చారిత్రము కల, ఆ దేవి మహిమలు లోకానుగ్రహము కొఱకు వశిన్యాది వాగ్దేవతలు సహస్ర నామములుగా సమకూర్చి, ఆ విశ్వజనని సమక్షంలో దేవసభలో గానంచేశారు. ఆతల్లి విని, ఆమోదముద్రవేసింది. ఆనాటి నుండి లలితాదివ్య సహస్రనామములు అందఱికి పారాయణకు వినియోగింప బడుతున్నాయి. దీనిలో సర్వవిద్యలసారము, వివరింపబడింది. అందుకే, వాటిని రహస్యనామములన్నారు. ఒక్కొక్కనామము ఒక మంత్రముతో సమానము. అందువల్ల అవి మాలామంత్రములుగా ప్రసిద్ధికెక్కాయి. ఇందులో ప్రతి ఒక్క నామము, భక్తుల కోరికలను తీర్చగలిగిఉంది. ఈ సహస్రనామ పారాయణము ఐహి,కాముష్మిక సకల సంపదలను ప్రసాదిస్తుంది. పరమపురుషార్థమైన మోక్షమును కూడా సిద్ధింపచేస్తుంది.

అమ్మ ఆదేశాన్ని అనుసరించి సకల విద్యలకు ఆధారమైన హయగ్రీవుడు, అగస్త్యమహర్షికి ఉపదేశించిన ఈ సహస్రనామములు, లోకములలో ప్రసిద్ధమై ప్రచారమునందున్నవి. శక్తిపీఠము లన్నింటి యందును శ్రీలలితా సహస్ర నామములే వినియోగ పడుతున్నాయి. అన్ని పాదములు, ఏనుగుపాదములో ఇమిడిపోయినట్లు తక్కినవి అన్నియు ఇందులో కలిసిపోవుచున్నవి.

'గురుమండలరూపిణి'యైన అమ్మనామములు గురుముఖతః ఉపదేశింప బడుట సంప్రదాయము. దోషరహితముగ పఠించినప్పుడు సత్ఫలితములు శ్రీఘ్రముగ



**సీ॥ క్షీరాబ్ధి శయనుఁడీ చిన్ని కూన యటంచుఁ**
**బాల బుగ్గల హొయల్ బయలు పఱచె**
**ఫణితల్ప మహితుండీ పసిపాపఁడంచని**
**మెత్తని నెమ్మేను మేలుసూపెఁ**
**గమలాక్షుండీ కసుఁగందు నిక్కంబని**
**కలికి కన్నుల సోయగంబుఁ దెలిపె**
**శ్రీనివాసుండె యీ చిఱుత బిడ్డండని**
**క్రొత్త కాంతి మఱింత యొత్తి పలికె,**
**తే.గీ. సకల సంశయములఁదీర్పఁ జాలదొక్కొ**
**విశ్వమోహను సర్వాంగ విలసనంబు,**
**చెలఁగు పురుషోత్తముని భాగ్య చిహ్నమెట్లు**
**దాచుకొన్నను దాగునే? తరలనయన!**

**(బాలకాండ, 3వ అ, 135వ ప.)**

ఈ పద్యంలో ఉన్న క్షీరాబ్ధి శయనుడు, ఫణితల్ప మహితుడు, కమలాక్షుడు, శ్రీనివాసుడు, విశ్వమోహనుడు, పురుషోత్తముడు అనే ప్రసిద్ధ పదములు నారాయణుని పర్యాయపదములై విష్ణు భావగర్భితమైన బాలరాముని వైభవమును నిరూపిస్తున్నాయి. కవి తాత్త్విక దృష్టికి అద్దంపడుతూ, రామకథా పరమార్థాన్ని ప్రకటిస్తున్నాయి.

**వేదవేద్యే పరేపుంసి జాతే దశరథాత్మజే ।**
**వేదఃప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా ॥**

'వేదం వలన తెలియదగిన ఆపరమపురుషుడు శ్రీమహావిష్ణువు. దశరథ తనయుడైన రామునిగా అవతరింపగా, వేదమే ప్రాచేతనుడైన వాల్మీకి నోట, శ్రీమద్రామయణంగా పరిణమించింది'అని పెద్దలు వివరించారు.



## ప్రకృతిలో పరమాత్మ దర్శనం

**అకలంకస్థితిఁ దత్పురోపవన సీమాంచ న్మమహానారికే**
**ళకుటస్తోమము విష్ణుపాదగతిఁ గ్రాలం జిత్రమే? తత్ఫల**
**ప్రకరంబొక్కట దివ్యసంయమి శివార్చాపూర్తిఁ గావించి త్ర్యం**
**బక సారూప్యముఁ జేకొనెన్ భువనగర్భత్వంబు వాటిల్లగన్,**

ఈ పద్యం శ్రీ తాడేపల్లి వేంకటప్పయ్య శాస్త్రిగారు వ్రాసిన 'శ్రీరామకథామృతము' బాలకాండ, అయోధ్యాపుర వర్ణనలోనిది. (వీరు 1910 ప్రాంతంలో గుంటూరు జిల్లా చందోలులో ఉంటూ, 'శంకర సంస్కృత కళాశాల' నిర్వహిస్తూ, విద్యార్థులకు అన్నవస్త్రములతోబాటు జ్ఞానదానం చేసిన మహామనిషి).

అయోధ్య చుట్టూ ఉన్న (ఉపవనములు) తోటలు, వివిధ వృక్షఫల భరితములై వాతావరణ కాలుష్యనివారణకు తోడుపడటంతో బాటు చక్కని ఫలసాయాన్ని కూడా ఇస్తున్నాయి. అక్కడి కొబ్బరిచెట్లు బాగా పెరిగి, ఆకాశాన్ని తాకుతున్నాయా అన్నంత ఎత్తుగా కనబడుతున్నాయి. కొబ్బరిబొండాలు నీటితో నిండి, మూడు కన్నులున్న శివునితో పోలిక కలవిగా ఉన్నాయి.

విష్ణుపాదం = ఆకాశము. ఆ చెట్లు, 'విష్ణు పాదగతిఁగ్రాలుట' అంటే ఆకాశం వరకు వ్యాపించి ఉన్నాయనే అర్థంతోబాటు, విష్ణుమూర్తి పాదములను ఆశ్రయించి, భక్తి భావంతో ప్రవర్తిస్తున్న జీవులను కూడా స్ఫురింపజేస్తున్నాయి. అంతేకాదు, ఇంకొక ఆశ్చర్యకరమైన విశేషమేమంటే ఆ కొబ్బరిబొండాలు నియమ నిష్ఠలతో శివుని అర్చించి, మూడు కన్నులుగల ఆ మహాదేవుని అనుగ్రహానికి పాత్రమై ఆ శివసారూప్యమును పొందాయట. కొబ్బరికాయకు మూడు కన్నులుండుట ప్రసిద్ధమే కదా! "భువన గర్భత్వంబు.........వాటించుట" అంటే, భువనములు = నీరు. జగదీశ్వరుడై ఆ శివునికి కడుపులో లోకము లిమిడి ఉన్నట్లే, కొబ్బరిబొండాలకు కడుపులో నీరుచేరి ఉండటం చూస్తాం. ఆ విధంగా అవి శివస్వరూపంతో విరాజిల్లుతున్నాయట.



## శ్రీమాతా లలితాంబికా

సృష్టిలో ప్రతి పదార్థానికి ఒక శక్తి ఉంటుంది. ఒక ప్రయోజన ముంటుంది. జడపదార్థామునందు జడముగాను, చేతన పదార్థమునందు చైతన్యముగాను ఉంటుంది. దానినే చిచ్ఛక్తి అంటారు. బలముగానుండి, బరువు మోయవలసిన 'దూలము' పుచ్చిపోవటమో, మధ్యకు విరిగిపోవటమో జరిగినప్పుడు దానిని తీసి ప్రక్కనపెట్టి, మరియొక చేవకలిగిన దూలమును వాడటమో, బాగుచేయించటమో చేస్తాము. అన్నింటికి, శక్తియే ఆధారము శక్తిలేని వస్తువు ఉండదు. వ్యక్తి కూడా అంతే ప్రాణశక్తి(ఊపిరి) ఉన్నంతవఱకు (ప్రాణులు) జీవులు కదలాడుతూ ఉంటాయి. ఏ ఆటఐనా ఆడుతూ ఉంటారు. ప్రాణము పోయిన తర్వాత పంచభూతములలో కలిసిపోతారు. ఇచ్ఛా, జ్ఞాన, క్రియాశక్తులు కూడా ఆదిశక్తియైన శ్రీమాతా స్వరూపమే. ప్రపంచమంతా ఆశక్తిమయమే. పరాత్పరి అయిన ఆశక్తినే బ్రహ్మమని బోధించారు. "**సర్వంఖలిదంబ్రహ్మ**" ఆ సర్వశక్తిమయమగు బ్రహ్మమును మమతానురాగభరితమైన మాతృరూపంతో భావించటం, ఆరాధించటం సులభమని కొందఱు తలచి, కొలిచారు. అట్టి మహర్షుల దర్శనము శాక్తేయ సిద్ధాంతంగా ప్రసిద్ధమైనది. అందుకు తగిన మూలములు వేదములోనే ఉన్నాయి. దానినే ఉపనిషత్తులు ఉద్ఘోషించాయి. పురాణాలు వర్ణించాయి. కావ్యములాలపించాయి. తక్కినవి చదవటానికి అవగాహన చేసుకోవటానికి (స్థాయి) అర్హత అందఱికి ఉండదు. అమ్మను అనుసరించటానికి ఏ అధికారము అక్కఱలేదు. గృహవాతావరణంలో బిడ్డలు కూడా తండ్రి కంటే, తల్లికి దగ్గఱ అవుతారు. కావలసిన కోరికలన్నీ ఏకరువు పెడతారు. పుస్తకాలు కొనాలనీ, పాఠశాల రుసుము చెల్లించాలని, విజ్ఞాన, వినోదయాత్రలకు డబ్బులు కావాలని నూతన వస్త్రములు కుట్టించాలని, ఇలాంటివే ఇంకెన్నో తల్లి యజమానితో(తండ్రి) చెప్పి చేయిస్తుంది. అందువల్ల ఆశక్తిని తల్లిగా కొలుస్తాము.

ఈ చరాచర సృష్టికంతటికి కామేశ్వరకామేశ్వరులు తల్లిదండ్రులు. "జగతఃపితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ" (కాళిదాసు) వారి సంకల్పమే ఈ జగత్తు

యోగంలో ఆత్మశక్తియైన కుండలిని జాగృతంచేసి బ్రహ్మరంధ్రం ద్వారా ప్రాణాన్ని విడిచిపెట్టాలి (బ్రహ్మ, ఆ రంధ్రం ద్వారానే జీవసృష్టి చేశాడు) అట్టివారికి తిరిగి పుట్టాల్సిన అవసరం ఉండదు. శాశ్వతానందం సిద్ధిస్తుంది. త్రిగుణాతీతమైన యోగము నిర్వికారమైనస్థితి. గీతాచార్యుడైన కృష్ణపరమాత్మ **'యోగస్థః కురుకర్మాణి'** అని **'యోగోభవతి దుఃఖహాః'** అని బోధించి **'తస్మాత్‌యోగీభవ, అర్జునా'** అని యోగ ప్రాధాన్యాన్ని చెప్పాడు. జన్మ దుఃఖమును పోగొట్టునది యోగము. జీవునకు శరీరం ఒక వసతిగృహం. స్వగృహమైన శాశ్వత బ్రహ్మపదమును చేరుటకు యోగమే మార్గం. గమ్యం. యోగమే శరణ్యం.

అలాంటి తత్త్వజ్ఞాన మెరిగి, యోగియై తమ జీవితాన్ని సుగమం చేసికొని, జీవితాంతం కర్మిష్ఠిగా సంసార పయోధి నీది, భవ బంధములను దాటి భౌతిక జీవన సహచరులైనోవరికి, సహజన్ములకు, బంధువులకు దార్శనికులై, ఆధ్యాత్మిక జీవన సోపానంలో తుది పదమంది, మంత్రోపాసకులుగా, ఆధ్యాత్మిక వేత్తగా, వేతాంతిగా, దాతగా, ప్రజాహితాభిలాషిగా జీవితాన్ని పండించుకోవాలి.





జ్ఞానమయమైన దృష్టిగలవారికి, సృష్టి అంతా బ్రహ్మమయంగానే కనబడుతుందని పెద్దలంటారు. జడములకు కూడ చేతనత్వమును కల్పించుట కవిప్రతిభకు తార్కాణం. ఆ శబ్దార్థములలోని చమత్కారం.

"నారుద్రో రుద్రమర్చయేత్", "దేవోభూత్వా దేవమర్చయేత్" మొదలగు శ్రుతి వాక్యములిందుకు ప్రమాణములు. ఏ దేవతను ఆరాధిస్తారో వారు, ఆ దేవతా స్వరూపాన్ని పొందుతారని ఆగమ శాస్త్రములు దీనిని వివరిస్తున్నాయి. "యాం దేవతాముపాస్తే సతద్రూపోభవతి".

పై పద్యములో హరిహరులను స్మరించి, ఉపాస్యులైన వారిలో ఏ భేదములేదని, కవి నిరూపించిన తీరు అద్భుతం. ఇది సమన్వయంతో కూడిన భారతీయ సంస్కృతికి నిదర్శనం.

"సర్వం ఖలిదం బ్రహ్మ"మని కదా ఉపనిషత్ ఉద్ఘోష, ముక్తిలో సారూప్యము అనేది ఒకస్థాయి. అది ఇక్కడ సోదాహరణంగా వివరింపబడింది.



# ప్రత్యక్ష దైవం సూర్యుడు

దేవతలు తేజోమయరూపులు. వారు తలచుకొంటే తప్ప, మన చర్మ చక్షువులకు కనబడరు. అందుకే శ్రీకృష్ణుడు, అర్జునకు తన విశ్వరూపమును, ప్రదర్శించినప్పుడు, ముందుగా అతనికి బుద్ధి యోగమును అనుగ్రహించాడు. జగచ్చక్షువు, కర్మసాక్షి అయిన సూర్యుడు మాత్రము ప్రత్యక్షదైవము. "అసా వాదిత్యో బ్రహ్మ" అని, వేదము, అతనిని పరబ్రహ్మముగా కీర్తించింది. సూర్యుడు, తన కిరణములచేత లోకములందలి చీకట్లను పాఱద్రోలి సకల జీవరాశికి ఆరోగ్యమును, అభివృద్ధిని కలిగించుచున్నాడు. సమస్త ప్రకృతికి అతడే ఆధారం.

యోగులు, తమ హృదయాకాశంలో తేజః పుంజమై వెలుగొందు ఈ సూర్యుడు విశుద్ధి చక్రాన్ని శుద్ధి చేసి, జీవుని పవిత్రుని గావించి బ్రహ్మానుభవానికి దోహదపడటం గమనించి వివరంగా వర్ణించారు. బ్ర.వే. తాడేపల్లి రాఘవ నారాయణ (చందోలు) శాస్త్రిగారు సూర్యుని ఈ విధంగా భక్తితో పార్థించారు. ఈ వృద్ధాప్యంలో నమస్కరించటం తప్ప, జపతపాదులు అధికంగా చేయలేనని వేడుకొన్నారు – ఈ భాస్కరుడు నమస్కార ప్రియుడనుట లోకప్రసిద్ధమే కదా.

**నెత్తిన పాదముల్ నిలిపి, నీకరజాలములన్స్పృశించి, యీ**
**పుత్తలమున్ బవిత్ర తమమున్ బొనరింపుము, తండ్రి! భాస్కరా!**
**హృత్తలమందు నిల్చి పచరింపు విశుద్ధ విశుద్ధి! నెప్డెటో**
**ముత్తరులన్భజింజెద నమోనమయంచు; నికేమి సేయుదున్;**

శ్రీరాఘవ నారాయణశాస్త్రిగారి తండ్రి శ్రీతాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రి గారు తమ "శ్రీరామకథాఽమృతము"లో ఒకచోట సూర్యోదయ వర్ణనచేస్తూ, సూర్యుని, చెలిగా (మిత్రుడు) తండ్రిగా, తల్లిగా గురువుగా దైవముగా భావించి, వర్ణించిన తీరు, మనోహరముగా ఉండి పాఠకులను ఆలోచింపచేస్తోంది.

మిత్ర, రవి, సూర్య, భాను, ఖగ, పూష, హిరణ్యగర్భ, మరీచి, ఆదిత్య సవితృ, అర్క, భాస్కరనామములు పర్యాయపదములై ఆయా శక్తి విశేషములను



# 'యోగియై' శరీరాన్ని విడిచిపెట్టాలి

పుట్టిన ప్రతివాడు మరణించక తప్పదు. తప్పని మరణాన్ని గురించి విచారించి ప్రయోజనం లేదు. ఇతర సంస్కృతులకు చెందిన వారంతా ఎలా సుఖంగా బ్రతకాలో చెప్పారు. మరణంతో వారి ఆలోచన ముగిసిపోతుంది. భారతీయులు మాత్రం మరణం అనంతరం కూడా ఏవిధంగా సుఖం కలుగుతుందో వివరించారు. ఎలా మరణించాలో కూడా సూచించారు.

శ్లో॥ **శైశవేఽభ్యస్త విద్యానాం । యౌవనే విషయైషిణాం ।**
**వార్థకే మునివృత్తీనాం । యోగేనాంతే తనుత్యజామ్ ॥**

మానవుడు చిన్నతంలో (5సం॥) విద్యాభ్యానికి తగిన వయస్సు రాగానే నిష్ఠగా సమస్త విద్యలను పొందాలి. యౌవనంలో యోగ్యురాలైన స్త్రీని వివాహమాడి సంసార సుఖాలను అనుభవిస్తూ వంశాభివృద్ధికి, గోత్రాభివృద్ధికి ప్రయత్నం చెయ్యాలి. వార్ధక్యదశ (ముసలితనం)రాగానే ముని వృత్తిని (మౌనమును) పాటించి, భగవచ్చింతన చెయ్యాలి. చివరకు యోగాభ్యాస వశమున శరీరాన్ని విడచిపెట్టాలి. ఇది రఘువంశజుల ఆదర్శ జీవన విధానం. ఇదే కాళిదాసు మహాకవి రఘువంశ మహాకావ్యంలో వర్ణించి మనకు చెప్పిన జీవన ప్రణాళిక.

**'గ్రహణ ధారణ పటుర్బాలః'** అన్నట్లు విద్యార్థిదశలో గురువులు చెప్పింది విని, గుర్తుపెట్టుకోగల చిన్నవయస్సులో విద్యాభ్యాసం చెయ్యాలి. తదుపరి వివిధ విషయాసక్తులైన వారికి విద్యరాదు అందువలననే శైశవమునందు విద్యలు నేర్చుకోవాలి.

**"తరుణస్తావత్తరుణీ సక్తః"** అన్నట్లు సంసార జీవితం సుఖ దుఃఖాత్మకంగా సాగుతుంది. **'వృద్ధస్తావచ్చింతాసక్తః'** అన్నట్లు ముసలితనంలో జరిగిన దానిని తలచుకుంటూ, జరుగుచున్నదానికి దుఃఖిస్తూ, జరుగబోయేదానికి భయపడుతూ జీవితం దుర్భరంగా మార్చుకోకుండా మునివృత్తితో కాలాన్ని సద్వినియోగం చేసుకుంటూ, బరువు–బాధ్యతలు వారసుల కందించి తుదకు యోగియై మరణించాలి.

రప్పించి, ఆదరించాడు రాముడు. రావణుడే ఆ వేషంలో వచ్చి శరణు వేడినా రక్షిస్తానని ప్రతిజ్ఞ చేశాడు.

ఆ సముద్రతీరంలోనే, సాగరజలాలతో విభీషణుని లంకా సామ్రాజ్యానికి రాజును చేస్తూ, ముందుగానే అభిషిక్తుణ్ణి చేశాడు. రావణుడు బ్రతికి ఉండగానే, విభీషణుని లంకకు రాజును చేశాడంటే, రాముని ఆత్మవిశ్వాసం, భక్త రక్షణ దాక్షిణ్యం ప్రకటితమవుతున్నాయి.

శరీరం గగుర్పొడిచే ఈ సన్నివేశం రాముని శరణాగత రక్షణలోని విశిష్టతను తెలియజేస్తుంది. అతని ధర్మనిష్ఠను, సత్య పరాక్రమాన్ని నిరూపిస్తుంది.

**రామో విగ్రహవాన్ ధర్మః సాధు స్సత్య పరాక్రమః ।**
**రాజా సర్వస్య లోకస్య వసవో వాసవో రివ ॥**

ఈ మాటలన్నది, భక్తులో, భజనపరులో కాదు. రావణుని అనుచరుడు, శత్రువర్గంలోని వాడైన మారీచుడు. లోకంలో "నీవు ఇంద్రుడవు, చంద్రుడవు" అని ఇచ్చకాలు పలికేవారు చాలామంది ఉంటారు. కానీ కఠినంగా (కటువుగా) ఉన్నా, హితము పలికేవారు లేరన్నది నిజం. జగమునందు, కావ్యజగమునందు, ఇట్టివి అరుదు. శ్రీమద్రామాయణం ఆ లోటు తీర్చింది. మారీచుని మాటల్లోనే వ్యక్తపరచింది. మంచి విషయాలు విని ఆచరించటం మానవ లక్షణం.

**సులభాః పురుషారాజన్ సతతం ప్రియవాదినః ।**
**అప్రియస్యచ పథ్యస్య వక్తా శ్రోతాచ దుర్లభః ॥**





వివరించుచు, ఆ లోకబాంధవుని వైభవమును ప్రకటించుచున్నవి. ఆ నామములను స్మరించుచు శ్రీ వేంకటప్పయ్య శాస్త్రిగారు భక్తితో నమోవాకములర్పించిన తీరు రుద్రనమకమును తలపించుచున్నది. "ఆదిత్యం చ శివం విద్యాత్, శివ మాదిత్యరూపిణమ్! ఉభయో రంతరంనాస్తి ఆదిత్యస్య శివస్య చ॥" అను శివపురాణ వచనమందులకు స్ఫూర్తియైయుండవచ్చును.

**"మిత్రాయ జగదేక మిత్రాయ తే నమ**
**స్తే నమో, రవయే నమో నమోఽ స్తు**
**సూర్యాయ, నమదఖిలార్యాయ తే నమ**
**స్తే నమో, భానవే తే నమోఽ స్తు**
**ఖగ పదా యాపవర్గప్రదాయ తే నమ**
**స్తే నమః పూష్ణే నమో నమోఽ స్తు**
**గర్భి తాండహిరణ్య గర్భాయ తే నమ**
**స్తే నమో-స్తు మరీచయే నమోఽ స్తు**
**మా మవాదిత్య సవితర్క వృపనయ**
**పాపచయ, మర్క, భాస్కర పాహి పాహి"**
**యనుచు మ్రొక్కుల నీ మ్రొక్కులయ్యకెలమి**
**దొనఁకనర్పింతురపుడు సజ్జనులు భక్తి;** *బా.కాం. 9/40ప.*

ఉదయం బ్రహ్మస్వరూపంగాను, మధ్యాహ్నము మహేశ్వరునిగాను, సాయంకాల సమయమున విష్ణువుగాను సూర్యుని సంభావించి నమస్కరించుట సంప్రదాయం – ఆ విధంగా ఆయన త్రయీ మూర్తియై వెలుగొందుచున్నాడు. త్రయీ అన్నది వేదమును కూడ బోధించుచున్నది. అనగా, వేద స్వరూపుడని అర్థము. రాత్రివేళ, పద్మకోశగర్భమున బంధింపబడి, బయట పడలేని తుమ్మెద, తమమును పోగొట్టి దయతో వెలుగులను ప్రసాదించు సూర్యదర్శనముతో ముక్తిని గాంచినట్లు జీవుడు, బుద్ధిశక్తులు ప్రకాశింపఁజేయు ఆ వేదమూర్తి అనుగ్రహముతో సంసార

బంధమునుండి ముక్తుడగుచున్నాడను పరమార్థమును బోధించుచు ప్రకృతోపయోగిగా ప్రకృతిని వర్ణించారు.

**కమల కోశగర్భగతి బంధమెడలక**
**సన్నఁబాసి యున్న షట్చరణము,**
**తమము దుల్చి తెల్వి దయఁ గూర్చు నా త్రయీ**
**మూర్తి దర్శనమున ముక్తిఁ గాంచె.**

**బా.కాం. 9/35ప.**

భాను మండల మధ్యస్థయైన ఆ తేజమును గాయత్రిగా ఉపాసించుట భారతీయఋషి సంప్రదాయము – పెద్దలనుసరించిన మార్గము.

**ప్రత్యక్షం బగు దైవ మీ రవిని నారాధింప నారోగ్యమున్,**
**ధృత్యుత్సాహ వివేక సంపదలు వృద్ధిన్గాంచు, నీ శక్తినే**
**యత్యాయత్తతఁగొల్చు నిజ్జగము గాయత్రీ మహాదేవిగా;**
**సత్యం బాతఁడె భర్గుఁడౌ నని రుపాస్యా! శ్రీత్రికూటేశ్వరా!**

(వ్యాసరచయిత)

అట్టి సూర్యోదయ సమయమున లోకములోని వారెల్లరు తమ తమ కర్తవ్యములను నిర్వర్తించుచు ధర్మతత్పరులగుట ఆమోదమును గూర్చును. ఈ భాస్కరుడు మేలు చేకూర్చువాడై లోకబాంధవుడగుట "శ్రీరామకథా౭మృతము"న ఇట్లు నిరూపింపబడినది.

**దొంగలఁ దోలి, జారధృఁద్రోచి యిరు ల్వెడలించి, గోరముల్**
**ద్రుంగగఁ జేసి పాపములఁ ద్రుంచి, యివంబు దొలంచి, తెల్విఁ దే**
**టంగలిగించి, రాత్రిచరడంబరము ల్దొలఁగించి ప్రోచు మే**
**ల్సంగతి, లోకబాంధవతఁ జాటదె యీ యినువంక లెంకగన్.**

**బా.కాం. 9/50ప.**





విపరీతమైన వత్తిడిచేసి, చంపుతానని బెదిరిస్తే, నేను నీచేతిలో చావటంకంటే రాముని చేతిలో మరణించటం మేలని, మృగరూపధారియై రామ కుటీరం దగ్గఱ సంచరించటానికి సిద్ధపడ్డాడు.

సీతాపహరణం, జటాయు మరణం, సుగ్రీవ సంభాషణం, వాలి సంహారం జరిగి సీతాన్వేషణకు సిద్ధం అయ్యారు వానరవీరులు. అందులో వాయుపుత్రుడైన హనుమంతుడు శతయోజన విస్తీర్ణమైన లవణ సముద్రాన్ని లంఘించి, లంకలో ప్రవేశించి అశోకవనంలో శింశుపావృక్షం క్రింద రామచింతనతో పవిత్రురాలైన సీతను సందర్శించి, ఆమె నూరడించి ఆ వర్తమానం రామునికి తెలియజేశాడు.

యుద్ధసన్నద్ధుడైన రాముడు, సపరివారుడైన సుగ్రీవునితో గూడి దక్షిణ సముద్రాన్ని చేరాడు. రావణుడు, మంత్రుల సమావేశంలో తనకు హితవు చెప్పిన విభీషణుని నిందించి, తన్నితరిమేశాడు. విభీషణుడు సర్వస్వాన్ని విడిచి, రాముని శరణువేడటానికై వచ్చాడు. చారులద్వారా రామునికి ఆ వార్త నివేదించాడు. ఆ సమాచారం విన్నవారంతా విమర్శించారు. ఇది కుట్రలో భాగమన్నారు. శత్రువర్గంలోని వాడు కనుక ఇప్పుడతనిని చేరదీయరాదన్నారు. కొంతకాలం పరిశీలించి, ఆ పై నిర్ణయం తీసుకోవటం సముచితమన్నారు. అందఱి ఆలోచనలు విన్న రాముడు **"శరణాగతరక్షణ"** పరమధర్మమనే తన అభిప్రాయాన్ని వెల్లడించి, విభీషణునికి అభయాన్ని ప్రసాదించాడు. జీవితంలో ఒక్కసారైనా ఎవ్వడైనా ప్రపన్నుడై నేను నీవాడనని, రక్షణ కల్పింపమని శరణు వేడితే అభయమివ్వటం తనకు కర్తవ్యమని చెప్పి, తన వ్రతవిధానాన్ని ప్రకటించాడు.

**సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతిచ యాచతే ।**
**అభయం సర్వ భూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ ॥**

భక్తులం మనమంతా వ్రతములాచరించి, వరములిమ్మని భగవంతుని వేడుకొంటాం. ఆ భగవంతునికీ ఒక వ్రతముందట, తనను కోరిన వారికి అభయమిచ్చి రక్షణ కల్పించటం దాని నియమమట. సుగ్రీవుని పంపించి, విభీషణుని

# "శ్రీరామః శరణం మమ"

**"శ్రీరాముడు నాకు శరణముగుగాక"** అని ఆకాంక్షించటం లోకపరిపాటి. **"శ్రీరామరక్ష-సర్వజగద్రక్ష"** అని పెద్దలు చెప్పటం వింటుంటాం. విద్యార్థులు, కవులు, వ్యాపారస్థులు మొదలైనవారు శుభాన్ని కోరుతూ తమతమ గ్రంథములను **'శ్రీరామ'**తో ప్రారంభించటం చూస్తూ ఉంటాం. రామ పదం కలిసివచ్చేలా తల్లిదండ్రులు పిల్లలకు నామకరణం చేస్తారు.

ఇంట్లో బిడ్డలకు పెండ్లి జరుగుతూ ఉంటే **"రామయ్య పెండ్లి కొడుకాయెనే"**, అనో, **"సీతమ్మ పెండి కూతురాయెనే"** అనో పాడుకుంటాం. చివరకు నవ వధువును అత్తవారింటికి పంపించేటప్పుడు **"పోయిరాగదమ్మ జానకీ"** అని సాగనంపటం అందరెఱిగిన విషయమే.

కవలలు పుడితే రామ,లక్ష్మణులని పేరు పెడతారు. కాడిక్రింద జోడెద్దులను ఆ పేరుతోనే పిలుస్తారు. పెంపుడు పక్షిని **'రామచిలక'** అని సంభావిస్తారు. ఇద్దరు మంచి స్నేహితులను కూడా ఆ విధంగా సంబోధిస్తారు. కలహించుకునే అన్నదమ్ముల్ని వాలి సుగ్రీవులని ఎగతాళి చేస్తారు. నిద్రాలోలుణ్ణి కుంభకర్ణుడని, మంచిని చూసి ఓర్వలేనమ్మను **'చుప్పనాతి శూర్పణఖ'** అని నిందిస్తారు. చాడీలు చెప్పి, సంసారాలు కూల్చేవారిని **'మంథర'**గా చూస్తారు. వాల్మీకి **"మంథరా పాపదర్శనీ"** అని, అట్టివారి ముఖం చూస్తేనే పాతకం చుట్టుకుంటుందని నిరసించాడు. దగ్గఱకు చేరనీయరాదని హెచ్చరించాడు.

రామపాద స్పర్శతో పునీతమైనది మన ఆంధ్రదేశం గోదావరీతీరం. అందఱి ఆరాధ్యదైవం ఆ భద్రాద్రిరాముడు. "భక్తుల కొంగు బంగారం" ఒంటిమిట్ట శ్రీరాముడు. ఎంతో ప్రసిద్ధి వహించిన రామాయణంలో "విభీషణశరణాగతి" విశిష్టస్థానాన్ని సంపాదించుకొన్నది. అది శ్రీరాముని వ్యక్తిత్వ నిరూపణం జరిగిన ఘట్టం.

రామలక్ష్మణులకు ఎదురుపడే శక్తిలేక రావణుడు, సీతాపహరణోద్యమంలో మారీచుని సహాయం కోరాడు. అది ఎంతమాత్రము నీకు తగదని, హితవు చెప్పాడతడు.



# "సర్వం విష్ణుమయం జగత్"

విష్ణు శబ్దమునకు వ్యాపనశీలం కలవాడు అని అర్థము. విశ్వవ్యాప్తమై ఉన్న ఒకే చైతన్యాన్ని పండితులు అనేక విధములుగా చెప్పారు. "ఏకం సత్ విప్రాః బహుధావదన్తి". ధ్యానంలో, ఆనందానుభూతి నొసగిన ఆ పరతత్త్వము, తమ మాటలలో వ్యక్తపరచేటప్పుడు నామ రూపములలో భేదమేర్పడి, ఇన్ని సంప్రదాయములు ఏర్పడ్డాయి. అభిరుచినిబట్టి ఎవరు ఏ రూపంతో, ఏ నామంతో సమర్పించినా అది పరతత్త్వానికే చెందుతుంది. ఆ సచ్చిదానంద స్వరూపము స్త్రీ అయితే శాక్తేయము, పురుషుడైతే శివకేశవ భేదంతో అనేకముగా ప్రసిద్ధ మయ్యాయి. ఈ సంప్రదాయములన్నింటికీ వేదములోనే మూలములున్నాయి. "వేదోఽఖిలో ధర్మమూలమ్". ఇదే భారతీయ సంస్కృతి. భిన్నత్వంలో ఏకత్వం. సమన్వయ సిద్ధాంతం.

స్థలము, జలము, ఆకాశము, స్థావరము, జంగమము అయిన ఈ జగత్తంతా విష్ణువుతో నిండిఉంది. జ్ఞానమయమైన దృష్టితో చూచినప్పుడు జగము బ్రహ్మమయంగా దర్శనమిస్తుంది.

**స్థలం విష్ణుః జలం విష్ణుః, విష్ణురాకాశముచ్యతే।**
**స్థావరం జంగమం విష్ణుః, సర్వం విష్ణు మయంజగత్॥**

ఈ అర్థమునే **"అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్యనారాయణ స్థితః"** అను శ్రుతి వాక్యము సమర్థిస్తోంది. పురాణేతిహాసములూ వివరించాయి.

జగద్రక్షకుడగు ఆ భగవంతుడు, ధర్మరక్షణ, దుష్టశిక్షణ పరమ ప్రయోజనంగా, అనేక పర్యాయములు భూమిపై అవతరించాడు. అదియే దశావతార వైభవంగా వింటున్నాం. అందులో **"కృష్ణస్తు భగవాన్ స్వయం"** అని కీర్తింపబడింది కృష్ణావతారము. అందులో ఆయన, తన విశ్వరూపాన్ని ఎన్నోమార్లు ప్రదర్శించాడు.

ధర్మరాజు, రాజసూయాధ్వరం వైభవంగా చేశాడు. యజ్ఞ నిర్వహణ సంఘంలో భీష్ముడు, ద్రోణుడు మొదలైన పెద్దలు సభ్యులుగా ఉన్నారు. యాగం ముగిసింది.

కర్తవ్యాన్ని సూచించవలసిందిగా ధర్మరాజు భీష్మణ్ణి అడిగాడు. ఒక విశిష్టవ్యక్తికి అగ్రతాంబూలమిచ్చి పూజించాలని భీష్ముడు చెప్పాడు.

ధర్మరాజు, సభలో కృష్ణుని ఉన్నతాసనం మీద కూర్చుండబెట్టి, పాదములు కడిగి, ఆ జలం నెత్తిన చల్లుకొని (విష్ణుపాదం నుండి పుట్టింది గంగ) అగ్రతాంబూల మిచ్చి గౌరవించాడు. సభలోని వారందరు కరతాళ ధ్వనులతో తమ ఆమోదాన్ని, ఆనందాన్ని ప్రకటించారు.

అంతలో కృష్ణుని మేనత్త కుమారుడు "శిశుపాలుడు" అనేవాడు లేచి, తన అభ్యంతరాన్ని తెలియజేస్తూ, పూజచేసిన వారిని, చేయించినవారిని, చేయించుకొన్న వారిని నిందించాడు. తన వారందరిని కూడగట్టుకొని సభాసదనం నుండి కదిలి బయటకు వెళ్ళిపోయాడు. అందుకు ధర్మరాజు బాధపడుతూవెళ్ళి అతనిని బ్రతిమాలాడాడు. ఇందులో భీష్ముని తప్పు ఏమిటని ప్రశ్నించాడు.

**అదిజుడైన బ్రహ్మ యుదయంబున కాస్పదమైనవాడు, వే**
**దాది సమస్త వాఙ్మయము లందు బ్రశంసితుడైనవాడు,లో**
**కాది, త్రిలోకపూజ్యుడని యాత్మ నెఱింగి పితామహుండు, దా**
**మోదరు జెప్పె పూజ్యుడని, యుక్తముకాకిది ఏమి దోషమే ॥**

కృష్ణుని పూజించడం సభవారందరికి ఆమోదయోగ్యమైనప్పుడు నీకెందుకీ అనవసరమైన ఆలోచన అని మందలించాడు. రాగము, ద్వేషముకలిగి, పెద్దలతో అకారణవైరము పాటించేవారికి, ఉన్న కొద్దిసంపదతోనే కళ్ళుమూసుకుపోయిన వారికి ధర్మస్వరూపం తెలియదు.

భీష్ముడు, కృష్ణుని పూజించమని చెప్పింది తానే కనుక, ఎందుకు పూజించమన్నాడో వివరిస్తూ ఇలా చెప్పాడు.

**పూజితుల తృప్తులగుదురు**
**భూజనులెొరు, లచ్యుతుండు పూజితుడగుడున్**
**తేజమున జగత్రితయము**
**పూజితమై వృద్ధిపొందు పుణ్య సమృద్ధిన్**



**జగములు, నంతరాత్మయును, సాక్షియు, నీవనుచున్ నిజంబుగా**
**నిగమములాడగా వినియు, నేడితరంబుగ మాకభీప్సితం**
**బగువరమెట్లు వేడగలమయ్య! భవన్మయమైన పూర్ణ చి**
**ద్గగనములో మమ్ముం గలిపి, క్రమ్మఱం బుట్టెడు బాధమాన్పవే.**

ఈశ్వరానుగ్రహము వలననే మానవులకు అద్వైతభావన కలుగుతుంది. తద్వారా మోక్షము సిద్ధిస్తుంది.



స్వామిని పూజారి, ఆగమ శాస్త్ర పద్ధతిలో పూజిస్తే, తిన్నడు (బోయవాడు) శ్రుతివ్యవహారేతరమైన విధానంగా పూజించాడు. ఇరువురి భక్తి భావంలో పరమేశ్వరునికి భేదం కనబడలేదు. అందువల్ల ఇద్దరిని ఆదరించాడు. అభిమానించాడు. ఇరువురికి తనలో స్థానం కల్పించాడు.

ఈశ్వరుడు తిన్నని అనన్య భక్తికి మెచ్చుకొన్నాడు. అతడిచ్చిన ఆహారాదులు స్వీకరించాడు. పూజారికది మ్రింగుడు పడలేదు. ఎంగిలిమంగలమైన దైవ సన్నిధానాన్ని ఏవగించుకొని, ఈశ్వరునే కారణం తెలియజేయమని సూటిగా అడిగాడు. స్వామి, తిన్నని భక్తికి పరీక్షపెట్టి, అతడు ప్రాణములను కూడా లెక్కచేయక కన్ను అప్పగించిన తీరు నిరూపించాడు. తిన్ననికి, లింగాకృతిలో శిలగాక, శివుడే కనబడుచున్నాడు. అతని భక్తి భావమునకది పరాకాష్ఠ.

పరమేశ్వరుడు ప్రసన్నుడై, వారికి ప్రత్యక్షమై వరం కోరకొమ్మన్నాడు. వారు పూర్ణుని, సత్య స్వరూపుని నిన్ను చూచుటే మహద్భాగ్యము. మా వ్యామోహములు నశించాయి. ఇంతకంటే వేరే వరం మాకెందుకు? ఇట్లు మన్నింపుమని వేడుకొన్నారు. జగములన్నీ నీవే యని తెలిసి, వేరొక వరం, ఏమని అడుగుతాం. ఆనంద స్వరూపమైన నీలో మమ్ములను కలుపుకొని మరల పుట్టవలసిన అవసరం లేకుండా చేయమని ప్రార్థించారు. శివుడు వారి కోరిక మన్నించాడు. జీవులందరూ కోరదగినది ఆ కోరిక. ముక్తికదే మార్గము. ధూర్జటి మహాకవి రచించిన పద్యములిక్కడ దలచుకొనుట సమంజసమని ఉదహరిస్తున్నాను. ఆ సుకృతికి కృతజ్ఞతాంజలి ఘటిస్తున్నాను. మోక్షము మాటలలో వివరించేది కాదు. అనుభవంలో పొందవలసిందేనని తెలుసుకొనుట వారి జ్ఞానము. జ్ఞానము వలననే మోక్షము సిద్ధిస్తుంది.

**మీ పూర్ణంబగు దివ్యతేజము జగన్మిథ్యాత్మకత్వప్రతి**
**ష్ఠా పారీణత జూపి మమ్ము, బొదువన్ జాంచల్య దూరంబులై**
**చూపుం జిత్తము మిన్నకున్నయవి యచ్చోబాసె దేహంబుపైఁ**
**దీపుంజీకటి, ఇంతకన్నవరమేదీ? యిట్లు మన్నింపవే!**



కృష్ణుడు, భగవంతుడగు త్రివిక్రముడు గావున, అతనిని పూజించినచో ముల్లోకములను పూజించినట్లవుతుంది. దీనిని బట్టి ఎవరిని పూజిస్తే మూడులోకములు పూజింపబడతాయో అతడు విష్ణువు. ఎవడు తింటే ముల్లోకములు తిన్నట్లవుతుందో అతడే భగవంతుడు కృష్ణుడు. అకాలంలో దుర్వాసుడు శిష్యగణంతో వచ్చి భోజనం పెట్టమన్నప్పుడు, కృష్ణుడు అక్షయ పాత్రలో ఒక్కమెతుకు తీసుకొని తిని, తృప్తిపడి మునికి, శిష్యులకు సంపూర్ణమైన భోజనంచేసిన సంతృప్తిని కలిగించాడు.

అంతటా ఉన్నవాడు, అన్నిటా ఉన్నవాడు వాసుదేవుడని చెప్తారు. అట్టివాసుదేవుడు కృష్ణుడు. దేవతార్చన, నివేదన, ఇట్టి భావనతోనే చెయ్యాలి.

**వాసనా ద్వాసుదేవస్య, వాసితం తే జగత్త్రయం ।**
**సర్వభూతనివాసోఽసి, వాసుదేవ నమోఽస్తుతే ॥**

**॥హరిః ఓం తత్సత్ ॥**



# నిత్యాగ్నిహోత్రం

భారతీయ సంస్కృతిలో అగ్ని-ఉపాసనకు మిక్కిలి ప్రాధాన్యత ఉన్నది. వేదములన్నీ యజ్ఞములందు వినియోగము కలవై ప్రశస్తిని పొందుతున్నాయి. దేవతలు అగ్ని ముఖముగా తమ హవ్యములను స్వీకరించి (అగ్ని ముఖావై దేవాః) సంతుష్టులై యజమానులకు సకల సుఖములను, శుభములను ప్రసాదిస్తున్నారు.

దేవతలకు హవ్యము, (ఆహారము)నిచ్చు అగ్నికి హవ్యవాహనుడను పేరు ప్రసిద్ధమైనది. ఈ విధంగా మానవులకు దేవతలకు పరస్పరము గౌరవాభి మానములను కలిగించునది యజ్ఞము. భారతీయులు అంటేనే కాంతిని (జ్యోతిని) ఇష్టపడేవారని అర్థం. స్నేహము, వివాహము అగ్ని సాక్షిగా చేసుకొనటం జరుగుతుంది. ఏ శుభకార్యమైనా ఎట్టి సభాసందర్భమైనా దీపారాధనతోనే ప్రారంభింపబడడం నేటికీ గమనిస్తూఉంటాం. వెలుగు జ్ఞానానికి ప్రతీక – పరబ్రహ్మకు సంకేతం.

అది ఆర్యావర్త దేశం. వరణానదీ తీరం. అరుణాస్పద పట్టణం. సకల సంపదలకు నిలయం. అక్కడున్న వారిలో ప్రవరుడొక ఉత్తమ గృహస్థుడు. అతడు సమస్త విద్యల నెఱిగినవాడు. విద్యార్థులకు పాఠం చెప్పడమంటే అతనికి ఇష్టం. నిత్యం తల్లిదండ్రులను సేవించడం, యజ్ఞయాగాది ధర్మకర్మలాచరించడం అతని ప్రవృత్తి. అతిథి పూజ చేయడం అతనికొక వ్రతం. అతనికి తగిన ఇల్లాలు లభించడం అతడు చేసుకొన్న పూర్వ పుణ్యఫలం. ఏ సమయంలోనైనా, ఇంటికి వచ్చిన అతిథులకు సమృద్ధిగా వండి వడ్డించడంలో ఆమె అన్నపూర్ణను గుర్తుచేస్తుంది.

ఒకనాడొక సాధువు తన ఇంటికి రాగా, అతనికి అతిథి మర్యాదలు చేసి, మృష్టాన్న భోజనం పెట్టి తీరికగా అరుగుపై కూర్చున్న వేళ అతడు చూసిన తీర్థక్షేత్రములందలి విశేషములను గూర్చి చెప్పమని అడిగాడు ప్రవరుడు. ఆ సాధువు దేశం నలుమూలలా తిరిగి అతడు చూసిన విశేషములను, వింతలను, అచటి ప్రకృతిలోని అందచందములను వివరించి చెప్పాడు.



అనుభవించవచ్చు. మోక్షము మాత్రము వ్యక్తిగతమైనది. ఆయాజీవుల సంస్కారబలము వలన సిద్ధిస్తుంది. అందుకే వివాహ సమయంలో, కన్యాదాత వరునిచేత 'ధర్మేచ, అర్థేచ, కామేచ నాతి చరామి' అని ప్రతిజ్ఞ చేయించి, కన్యాదానం చేస్తాడు. మోక్షము స్త్రీ పురుషులలో ఎవరి సాధనా తీవ్రతను బట్టి వారికి లభిస్తుంది. దృఢమైన సంకల్పమే సిద్ధిస్తుంది. ఆయా జీవుల సంస్కారమందుకు దోహదం చేస్తుంది. మోక్షమునకు అందరూ అర్హులే.

ముక్తి మార్గము నన్వేషించుట, సత్సంగము ద్వారా సాధ్యపడుతుంది. సత్సంగము వలన లోక వ్యవహారములకు దూరముగా నుండే 'నిస్సంగము' అలవడుతుంది. నిస్సంగము బంధహేతువైన మోహమును పోగొడ్తుంది. మోహము నశించుటచే, ఏకాగ్రత సిద్ధిస్తుంది. తాను సత్యమునకు చేరువై బ్రహ్మమును తెలుసుకొనగల స్థితికి (ఉన్నతస్థాయి) అతడు ఎదుగుతాడు. సత్యం జ్ఞాన మనంతమైన బ్రహ్మమే తానను 'పరమార్థమును' అనుభవము ద్వారా గుర్తించుటే జీవన్ముక్తి. అట్టి వారికి మరు జన్మ ఉండదు. ఈ ముక్త స్థితికి 'ఉపాధి' ముఖ్యముకాదు. జీవులందరూ అందుకు అర్హులే.

'శ్రీకాళహస్తీశ్వరుడు', తనను సేవించి, తరించిన భక్తుల నామముతోనే వ్యవహరింపబడుచూ వారికి తన రూపమిచ్చి, అనుగ్రహించుటను తెలియజేస్తున్నాడు. శ్రీకాళహస్తిలో స్వామి ఆ మూడింటి సమాహార రూపంలోనే దర్శనమిస్తాడు. శ్రీ అంటే సాలె పురుగు, 'కాళ' అంటే పాము, హస్తి అంటే ఏనుగు. ఈ మూడింటికి భక్తి వలన ముక్తి కలిగిందని 'శ్రీకాళహస్తీశ్వర మహాత్మ్య'మనే గ్రంథంలో వర్ణింపబడింది. దుర్గాదేవి భక్తులు దుర్గగా, అయ్యప్పస్వామి భక్తులు అయ్యప్పలుగా పిలువబడి గౌరవింపబడటం నేడు ప్రత్యక్షంగా చూస్తున్నాం. ఏ జన్మ ఫలమో ఆ జీవులకట్టి అదృష్టం కలిగింది.

ఆ గ్రంథంలోనే వర్ణితమైన మరొక కథలో తిన్నని చరిత్ర వివరింపబడింది. తిన్నడు స్వామికి కన్ను అప్పగించాడు కావున 'కన్నప్ప'గా కూడా ప్రసిద్ధుడయ్యాడు.

పురుషార్థములు నాల్గింటిలో చివరిది, అతి ముఖ్యమైనది మోక్షము. మొదటి మూడు, భోగములను సమకూరుస్తాయి. ధర్మాచరణం వలన వచ్చిన పుణ్యఫలాన్ని అనుభవించటానికి కూడా జన్మలెత్తవలసి ఉంటుంది. అధర్మాచరణం దుఃఖ హేతువైన జన్మకు కారణమవుతుంది.

**స్థిరమగు పుణ్య కర్మమున దేవభవంబగు, పుణ్యపాప సం**
**కరమున మానుషత్వమగు, కల్మషముల్ పశుకీటభావమున్**
**బొరయగఁజేయు, నిప్పగిదిఁబుట్టుచు, జచ్చుచు మోహవార్ధిలో**
**తిరుగుచునుండుగాని, యొక తీరముజేరడు జీవుడెన్నడున్!**

ఈ జన్మ పరంపరను అరికట్టి మరల పుట్టనవసరము లేకుండునట్లు చేసేది మోక్షము. (ముక్తి) విడుదల యని దాని అర్థము. కోరికల వలలనే మరల, మరల పుట్టుక ఏర్పడుతోంది. పుట్టినవారికి ఆరాట, పోరాటములు తప్పవు. నిరంతర ధర్మాచరణ తత్పరునకు నిర్మలమైన మనస్సు ఏర్పడుతుంది. మంచి, చెడుల గూర్చి ఆలోచించగల విచక్షణా జ్ఞానం కలుగుతుంది. జ్ఞానికి, విషయ సుఖములు శాశ్వతములు కావని తెలుస్తుంది. ప్రబోధబుద్ధి అయినవాడు తపస్సుచేత, ఇంద్రియములను జయించి, సత్యమునందు అనురక్తుడై, పరిపూర్ణ ప్రజ్ఞావంతుడుగా పరిణమించి తుదకు పరమార్థప్రదమైన ఆనందస్థితికిచేరి భగవత్ సాయుజ్యమును పొందుతాడు. తాను బ్రహ్మయై ప్రకాశిస్తాడు. నిరపేక్షమగు కర్మాచరణము ధర్మమును బోధ పరుస్తుంది.

**చిరముగ ధర్మముల్ నడపఁ జిత్తతతేరు, ప్రసన్న చిత్తుడై**
**పరువడు నింద్రియార్థముల భంగులురిత్తలుగాఁదలంచి, చె**
**చ్చెర నవి యంతవట్టునిరసించి, తపో, దమ, సత్యశీలుడై**
**పరిణతినొందు, పొందుఁబిదపన్ బరమార్థ పదప్రభావమున్** (భా. అ. ప.)

అనన్య భక్తులకు యోగ క్షేమములు భగవంతుడు తప్పక కల్పిస్తాడు. నేనే బాధ్యత వహిస్తానని స్వయంగా చెప్పాడు. ధర్మము, అర్థము, కామము కుటుంబపరంగా, సామాజికపరంగా అందరూ ఆచరింపవచ్చు ఫలములను



**ఓ చతురాస్య వంశకలశోదధి పూర్ణశశాంక! తీర్థయా**
**త్రాచణశీలినై జన పదంబులు పుణ్యనదీనదంబులున్**
**జూచితి, నందు నందుగల చోద్యములన్ గనుగొంటి నాపటీ**
**రాచల పశ్చిమాచల హిమాచల పూర్వదిశాచలంబుగన్.**

**కేదారేశు భజించితిన్ శిరమునన్ గీలించితిన్ హింగుళా**
**పాదాంభోరుహముల్ ప్రయాగనిలయున్ బద్మాక్షు సేవించితిన్**
**యాదోనాథసుతాకళత్రు బదరీనారాయణుం గంటి నీ**
**యా దేశం బననేల జూచితి సమస్తాశావకాశంబులన్** (మనుచరిత్ర)

ప్రవరుడది విని, మీరు వయస్సులో చిన్నవారిలా కనబడుతున్నారు. ఇన్ని ప్రదేశములు మీరెప్పుడు, ఎలా సందర్శించ గలిగారని అడిగిన ప్రవరునికి, ఆ సాధువు తన వద్ద 'పాదలేప'మనే దివ్య ఔషధమున్నదని, దాని ప్రభావంచేత అనుకున్నచోటికి క్షణంలో వెళ్ళి రాగలనని చెప్పాడు.

తీర్థ సందర్శనాభిలాషియైన ప్రవరుడు, కుతూహలంతో అడుగగా అతని పాదములకు ఆ పసరు పూసి, తనదోవన తాను వెళ్ళిపోయాడా సాధువు. ప్రవరుడు ప్రకృతి అందాలకు నిలయమైన హిమాలయానికి వెళ్ళి పౌరాణిక, చారిత్రక సన్నివేశములకు సాక్షియైన ఎన్నో ప్రదేశములను చూసి, సూర్యుడు నడినెత్తికి రావటం గమనించి మాధ్యాహ్నిక విధులైన సంధ్యాదులను నిర్వర్తించవలసిన వాడు కనుక, తక్కిన విశేషములు మరునాడు చూడవచ్చుననే ఉద్దేశంతో ఇంటికి పోవటానికి సంకల్పించాడు. హిమాలయంలో సంచరించే సమయాన అతని పాదలేపము మంచుకు కరిగిపోవటంతో ప్రయాణం సాగలేదు.

అతడు ఇంటికి చేరే ప్రయత్నంలో అక్కడ తనకెవరైనా సహాయం చేస్తారేమో అని, అటూ, ఇటూ చూస్తూ వెతకడం ప్రారంభించాడు. అంతలో అతనికి ఒక జనావాసం కనబడింది. అప్పుడచటికి చేరబోయిన ప్రరునికి 'వరూధిని' అనే గంధర్వకాంత కనబడి, అతని అందచందములకు ముచ్చట పడింది. తన ఊరు

చేరు మార్గమును చెప్పమన్న అతని మాటలను పట్టించు కోకుండా తనతోగూడి సకల భోగములను అనుభవింపుమని కోరింది.

తన నియమ నిష్ఠలను వివరించి, తనకు మార్గమును చూపుమని వేడుకున్న ప్రవరునితో ఇంద్రియ సుఖమే బ్రహ్మానందమని, మరణానంతరం లభించే స్వర్గసుఖములు ఇక్కడే, ఇప్పుడే లభింపగలవని ప్రలోభపెట్టింది. అతడు ధర్మ ప్రవర్తనము వలన, అగ్ని ఉపాసనచే కలుగు విశేషమును వివరించి, యజ్ఞములందు వినియోగించే వస్తువులు (అరణలు) దర్భలు, అగ్నులు తప్ప తక్కినవి తనకు ఇష్టములు కావని, తా నేఇతర సుఖములు కోరనని చెప్పి, శిథిలమయ్యే స్వభావం గల ఈ శరీరమే శాశ్వతము కాదు. దాని వలన కలిగే సుఖములు క్షణికములని నిరూపించి అవి మీసాలపై అంటిన తేనె బిందువుల వంటివని నిరసించి, ఆమె ప్రతిపాదనను తిరస్కరించాడు.

**తరుణీ! రేపును మాపు హవ్యములచేతన్ దృప్తుడౌవహ్ని స**
**త్కరుణాదృష్టి నొసంగు సౌఖ్యములనెన్నన్ శక్యమే నీకు. నా**
**కరణుల్ దర్భలునగ్నులున్ బ్రియములైనట్లన్యముల్గా, వొడల్**
**తిరమే? చెప్పకుమిట్టి తుచ్ఛ సుఖముల్ మీసాలపై తేనియల్!**

ధర్మాత్ముడైన ప్రవరుడు భక్తితో అగ్నిని ప్రార్థించి అతని సహాయంతో సూర్యాస్తమయంలోపల ఇంటికి చేరి తన విధులను నిర్వర్తించాడు. మోహ నిమగ్నురాలైన వరూధిని, తుదకు కపటునిచేతిలో వంచింపబడి మోసపోయింది. ఈ సందర్భంలో ప్రవరుని వ్యక్తిత్వం ప్రకటింపబడి ఉత్తమ మానవత్వానికి మార్గదర్శకంగా నిలిచింది.

**దాన జపాగ్నిహోత్రపరతంత్రుఁడనేని, భవత్పదాంబుజ**
**ధ్యానరతుండనేని, పరదార ధనాదులఁ గోరనేని స**
**న్మానముతోడనన్ను సదనంబున నిల్పుమినుండు పశ్చిమాం**
**భోనిధిలోన గ్రుంకకయ మున్న రయంబున హవ్యవాహనా!**



న్యాయ(ధర్మ) మార్గంలో నడిచేవానికి పశుపక్ష్యాదులు కూడా సహాయం చేస్తాయి. పెడబుద్ధితో అన్యాయ (అధర్మ) మార్గంలో ఉన్నవారిని సోదరులు కూడా విడిచిపెడతారు. అన్నది భవభూతి మాట. ఇదే రామాయణ సారాంశం.

యాంతి న్యాయ ప్రవృత్తస్య తిర్యఞ్చోఽపి సహాయతాం ।
అపంథానం తు గచ్ఛంతం సోదరోఽపి విముంచతి ॥

ధర్మస్వరూపం తెలిసీ, తప్పుచేయడానికి సిద్ధపడిన వారిని మూర్ఖులంటారు. భారతంలో దుర్యోధనుడు

**“జానామి ధర్మం న చ మే ప్రవృత్తిః**
**జానామ్యధర్మం న చ మే నివృత్తిః ॥”**

“నాకు ధర్మ తెలుసు. కానీ ఆచరించటానికి నా మనస్సెందుకో ఇష్టపడటంలేదు. నేను చేసేది అధర్మమని తెలుసు. కానీ నేను చేయకుండా ఉండలేకపోతున్నాను.” అంటాడు. ఈ విధమైన మానసిక బలహీనతను జయించినప్పుడే ధర్మాచరణము సాధ్యపడుతుంది.

ప్రతి జీవి తన కర్తవ్యాన్ని (ధర్మాన్ని) చక్కగా నెరవేర్చటం వలన వ్యక్తికి, కుటుంబానికి, సమాజానికీ మేలు చేకూరుతుంది. అట్లా కాకుండా ఒకరి పనిలో వేరొకరు వేలు పెడితే ఆ పనిని తాను సమర్థంగా చేయలేడు, సరికదా! నిపుణతగల తన పనికి దూరమై “రెంటికి చెడిన రేవడి” వలె నిరుపయోగి అవుతాడు. తద్వారా లోకంలో అవ్యవస్థ ఏర్పడుతుంది. తనకి నచ్చిన, వచ్చిన పనిచేసి జనాన్ని మెప్పించటం సులభం, సౌఖ్య దాయకం. అందుకే గీతాచార్యుడు– “స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః” అని ప్రబోధించాడు.

పుట్టినవాడు గిట్టడం ప్రకృతిధర్మం. అలా కాకుండా మరణం లేని జీవనం కావాలని కోరుకున్న రాక్షసులు వరబల గర్వితులై లోకకంటకులుగా మారి, వేరొకమార్గంలో ఉపాయాంతరం చేత మరణించడం గమనించాం. ధర్మవిరుద్ధంగా ప్రవర్తించడం, పరమాత్మ స్వరూపమైన ప్రకృతి కూడా సహించదు. తప్పక ప్రతీకారం తీర్చుకుంటుంది.

తిన్న మారీచుడు. సీతాపహరణోద్యమములో తనకు సాయం చేయమని వేడుకొనుచూ తన ఆశ్రమానికి వచ్చిన రావణుని నివారించటానికి మారీచుడు ఇట్లా చెప్పాడు. అట్టి ఆలోచన తగదని నచ్చజెప్పడానికి ప్రయత్నించాడు.

**రామో విగ్రహవాన్ ధర్మః సాధుః సత్యపరాక్రమః ।**

**రాజా సర్వస్య లోకస్య వసవో వాసవోరివ ॥**

ధర్మము అంటే కర్తవ్యము అనే అర్థమూ ఉంది. ఎవరిపని వారు బాగా నిర్వహించడం కూడా ధర్మనిర్వహణగా పరిగణింపవచ్చును. వేదం కూడా ‘ధర్మా న్నప్రమదితవ్యం’ అని హెచ్చరించింది.

శ్రీరాముడు అన్ని వేళలా అందరియెడల తన కర్తవ్యాన్ని చక్కగా నిర్వర్తించాడు. అందువల్లనే ధర్మవిగ్రహునిగా కీర్తించబడ్డాడు. కుమారునిగా, సోదరునిగా, భర్తగా, మిత్రునిగా, పాలకునిగా, రక్షకునిగా తన విధిని తాను చక్కగా పాటించాడు. తుదకు శత్రువుతో యుద్ధం చేసేటప్పుడు కూడా ధర్మాన్ని తప్పని మర్యాదా పురుషోత్తముడు రాముడు.

శ్రీరాముడు ధర్మాన్ని పాటించడం కొరకు రాజ్యమును త్యజించాడు. కామమును జయించాడు. అతడు చేతికి వచ్చిన రాజ్యాన్ని, చేరవచ్చిన కాంతను ధర్మంకాదని త్రోసిపుచ్చాడు. పితృ, సత్య వాక్య పరిపాలన రూపమైన ధర్మాన్ని ఆచరించటం ద్వారా శ్రీరాముడు త్యాగమూర్తిగా కూడా దర్శనమిచ్చాడు. తన జీవితమందు త్యాగానికే తప్ప భోగమునకు తావులేదు అని నిరూపించాడు. “రామస్య అయనం రామాయణం” రాముని చరిత్రయే రామాయణం. ఆ నడవడియే సమాజానికి వరవడి.

రావణుడు తన భ్రాతయైన కుబేరుని బలవంతంగా తన్ని తరిమేసి లంకను ఆక్రమించుకొని పుష్పక విమమానాన్ని చేజిక్కించుకొని దురహంకారంతో మెలిగాడు. సీతాపహరణం ద్వారా పర స్త్రీవ్యామోహానికి పాల్పడ్డాడు. అందువల్లనే జగములన్నియూ ఆతనిని ద్వేషించాయి. కసిదీరా నిందించాయి.



ఈ కథ మార్కండేయ పురాణంలో 5,6 పద్యాలలో మాత్రమే ఉన్నది. దానిని “ఆంధ్ర కవితా పితామహుడు” పెద్దన మనుచరిత్రమనే పేర 6 ఆశ్వాసముల ప్రబంధంగా నిబంధించాడు. ఇందులో ప్రతిపద్యం హృద్యంగా మలచిన అక్షర శిల్పి పెద్దన. ఈ గ్రంథాన్ని అంకితం తీసుకున్న ‘సాహితీ సమరాంగణ సార్వభౌముడు’ శ్రీకృష్ణదేవరాయులు, పెద్దనను పల్లకీలో ఊరేగించి స్వయముగా అతని కాలికి గండపెండేరము తొడిగి సమ్మానించాడు. “అల్లసాని వాని అల్లిక జిగిబిగి” యని కవులు, పండితులు పెద్దన కవితాశైలిని ప్రశంసించారు. కన్నడ రాయలు మెచ్చిన “తెలుగు వెలుగు” అది.

తెలుగు వారి స్వతంత్ర కవితాప్రక్రియ ప్రబంధ రచనకు నాంది పలికినవాడు, తరువాతి వారికి మార్గదర్శకుడైన వాడు పెద్దన.



# ఎవరు లోకబంధువు

లోకమునకు హితము చేయువాడు లోకబంధువు. అన్నదాత, ఆరోగ్య ప్రదాతయైన సూర్యుడు లోకమలన్నింటికి మేలు చేకూరుస్తాడు. సూర్యుడు లేని లోకమును, చూడలేకపోవటమే కాదు ఊహించడం కూడ సాధ్యము కాదు. సమస్త సృష్టికి సూర్యుడే ఆధారము. స్థితి, లయములకూ అతడే కారకుడు.

**లోక బంధుఁడివములూనంబొనర్చి, య**

**హర్ముఖములకాచ్ఛ్యమందఁజేయు**

**నపుడె, మెఱసెఁజగము : హంసప్రకాశంబు**

**వడయునంత జడత వాయుటెంత?**

బా.కాం. 2 ఆ, 43 ప.

శ్రీ తాడేపల్లి వేంకటప్పయ్య శాస్త్రి (చందోలు) గారు వ్రాసిన శ్రీరామ కథాౖ మృతములోని పద్యము, సూర్యోదయాన్ని వర్ణించే సందర్భములోనిది.

సూర్యుడు, తన అరుణ కిరణాలతో లోకములందలి చీకట్లను దూరం చేస్తాడు. వెలుగులను ప్రసాదించి జగములను ప్రకాశింపచేస్తాడు. మంచును హరించి, చలిని తరిమివేస్తాడు.

సూర్యునికి వేదంలో 'హంస' అనే పేరు ప్రసిద్ధము. సూర్యుడు ప్రకాశించునప్పుడు జీవులలో జడభావము నశించి, చైతన్యము కలుగుతుంది. అప్పటి వరకు బద్ధకంగా నిదురించేవారు కూడా సూర్యుని రాకతో లేచి తమ తమ కర్తవ్యముల యందు ప్రవర్తిస్తారు.

'హంస' అనే పదమునుకు 'శ్వాస' అని కూడా అర్థం. ఆ శ్వాస ప్రక్రియ సక్రమంగా నడుచు యోగులకు జడత్వము=అజ్ఞానము తొలగిపోతుంది. వారు, ప్రజ్ఞానఘనులై, పరబ్రహ్మరూపమైన సచ్చిదానందమును అనుభవిస్తారు. శ్వాసమీద ధ్యాసనిలిపిన సాధకులు, ఉచ్ఛ్వాస, నిశ్వాసములలో వరుసగా, హం, సం అనే శబ్దములను గమనింపగలుగుతారు. అట్టివారు ఆత్మజ్ఞాన సంపన్నులై, ముక్తిని పొందగలుగుతారు. యోగరహస్యమిందులో వివరింపబడింది.



తాత్పర్యము. ఇందుకు రామాయణమే నిదర్శనము. "కేవలము అర్థపరుడు, (ధనాశతో పరుగులు తీసేవాడు) డబ్బుకొరకు నిరంతరం ప్రాకులాడేవాడు లోకమున ద్వేషింపబడుచున్నాడు. కామాతురుడు సైతం నిందించ బడుతున్నాడు." అని ఆచరింప తగినది ధర్మమే శ్రీమద్రామాయణంలో రాముడు లక్ష్మణునకు బోధించాడు.

**ధర్మో యతః స్యాత్ త దుపక్రమేత,**

**ద్వేష్యో భవ త్యర్థపరో హి లోకే**

**కామాత్మతా ఖ ల్వపి న ప్రశస్తా ॥**

పితృ, సత్య వాక్య పరిపాలనకై అడవులకు వెళ్లటము పుత్రునిగా తనకు పరమధర్మని శ్రీరాముడు భావించాడు. "మంథరా పాపదర్శని" అని అంటాడు వాల్మీకి. మంథర ముఖం చూస్తేనే పాపాలు చుట్టుకుంటాయట. మంథర వంటి వారు, పచ్చని సంసారంలో చిచ్చుపెట్టడానికి కూడా వెనుకాడరు. కైక మంథర మాటలు విని, రామునికి వనవాసము, భరతునకు పట్టాభిషేకము జరగాలని పట్టుబట్టింది. ధనము, అధికారము కైకను ప్రలోభపెట్టాయి. శ్రీరామునియందు సహజంగా ఆమెకు గల అనురాగాన్ని కూడ ప్రక్కకు నెట్టాయి. కైకకు ఏర్పడిన ఈ అర్థపరత్వము, అనర్థ పరంపరలకు దారితీసింది. భర్తను పోగొట్టుకొంది. లోకులామెను నిందించడానికి కారణమైనది. చివరకు తనయుడైన భరతుడు కూడా ఆమెను నిరాదరించడానికి మూలమై నిలిచింది.

రావణుడు కాముకుడై సీతనపహరించుట లోక మతనిని నిందించటానికి హేతువైనది. అతని స్వార్థచింతన, సపరివారముగ నాతడు వినాశమందుటకు బాటలు వేసింది. తన చెల్లెలు శూర్పణఖకు జరిగిన పరాభవమునకు ప్రతీకారమను నెపముతో రావణుడు చేసిన అకృత్యము ఆత్మగౌరవమును, భంగపరచింది. బంధువర్గములను దూరము చేసింది.

**"రామో విగ్రహవాన్ ధర్మః"** 'రూపముదాల్చిన ధర్మము రాముడు' ఈ మాటలంటున్నది భక్తిపరులో, భజనబృందమో కాదు. రామునిచేతిలో చావుదెబ్బ

**వేదములకు నఖిల స్మృతి**
**వాదములకు బహుపురాణవర్గంబులకున్**
**వాదైన చోటులను, తా**
**మూదల ధర్మార్థ కామమోక్షస్థితికిన్ – (తిక్కన)**

**'మూదల'** అంటే ప్రమాణమని అర్థం. ఈ ధర్మము చాలా సూక్ష్మంగా ఉంటుంది. **"నిదానమే ప్రధానమని"** ఒకచోట, **"ధైర్యేసాహసే లక్ష్మీ"** అని ఒకచోట చెప్పబడి సందేహాన్ని కలిగించేలా ఉంటాయి కొన్ని వాక్యాలు. ఎప్పుడెవరికి, ఏది అవసరమో దాన్ని ఉపదేశించటం ఇందులో పరమార్థం. పిడుగుకు, బియ్యానికి ఒకే మంత్రం చెప్పరు కదా. సందర్భాన్ని బట్టి వ్యక్తిని బట్టి ప్రాముఖ్యం చెప్పబడుతుంది.

శ్రీరామకృష్ణ పరమహంస శిష్యులలో ఒకరు, దక్షిణేశ్వరం నుండి కలకత్తాకు గంగానదిలో పడవ ప్రయాణం చేస్తూ, పడవలో ఎవరో తమ గురువును **'దొంగ సన్యాసి, మోసగాడు'** అని నిందించగా, విని ఉద్రేకంతో పడవను ముంచేసే ప్రయత్నం చేశారు. పెద్దలు సర్దిచెప్పగా శాంతించారు. ఈ విషయం గురువుగారికి తెలిసింది. వారు, అంత **'ఆవేశం'** ఎందుకు? పడవమునిగిపోతే అందులో ఉన్నవారందరికి ఎంత ప్రమాదం? అని మందలించారు. మరొక్కప్పుడు వేరొక శిష్యుడు, గురుదేవులను నిందిస్తుంటే విని పట్టించుకోలేదని విని వారే (గురుదేవులు) నీకు గురుభక్తి లేదా? బాధ్యతతో సత్యాన్ని ప్రకటించటానికి నీవు ఎందుకు భయపడ్డావని కోపించారు.

పై రెండు సంఘటనలలో ఆవేశపరుడైన మొదటి శిష్యునకు **'నిదానాన్ని శాంతస్వభావాన్ని'** బోధించారు. రెండవ శిష్యునకు 'నిర్భయత్వాన్ని, బాధ్యతను కలిగి ఉండాలని' ఉపదేశించారు. అందువల్ల సమయాన్ని, సందర్భాన్ని బట్టి మనం ధర్మ స్వరూపాన్ని అర్థం చేసుకోవాలి. ఇది ఇంతే అని వితండవాదం చేయరాదు. అందరిని ఒకే తాటితో (సూత్రానికి) కట్టి వెయ్యాలని చూడరాదు. అది వివరించటానికే ఇంత (అనంత) వాఙ్మయం పుట్టింది.

పురుషార్థములు ధర్మాచరణ వలననే సిద్ధిస్తాయి. కావున ధర్మయుక్తములైన కార్యములనే ఆచరించాలి. ధర్మవిరుద్ధములై అర్థకామములను విడిచిపెట్టాలన్నది



మఱియు, సూర్యుడు తన రాకచే, దొంగలను పాఱద్రోలుతాడు. వ్యభిచారుల ధైర్యమును అరికడతాడు. చీకట్లను పోగొడతాడు. హింసాప్రధానమైన ఘోరకృత్యములను నశింపజేస్తాడు. పాపభావములను త్రుంచివేస్తాడు. శీతలమగు మంచును హరిస్తాడు. ప్రాణులకు తెలివితేటలను కలిగిస్తాడు. రాత్రించరులైన రాక్షసుల ఉద్ధతిని తొలగిస్తాడు. ఇన్ని విధముల సహకరించి, రక్షించే(ఇనుడు) ఆ సూర్యునకు 'లోకబంధువు' అనే పేరు సార్థకమవుతున్నది.

ఉ॥ **దొంగలఁ దోలి, జారధృతిఁ ద్రోచి, యిరుల్వెడలించి, గోరముల్**
**ద్రుంగఁగఁజేసి, పాపముల ద్రుంచి, యివంబుదొలంచి, తెల్విఁదే**
**టం గలిగించి, రాత్రిచర డంబరముల్ దొలగించి మించు మే**
**ల్సంగతి లోకబాంధవతఁ జాటదె యీ యినువంక లెంకగన్.**

బా.కాం. 9వ అ. 50వ ప.

'ఇనుడు' అంటే ప్రభువు, రాజు అనే అర్థాలు కూడా ఉన్నాయి. కనుక, ప్రభువులు అధికారాన్ని చేపట్టి జాగరూపకతతో తాము చేయదగిన బాధ్యతలు సహితము, ఇచ్చట సూచింపబడ్డాయి. అప్పుడే వారు 'లోకబంధువు'లుగా కీర్తింపబడతారు.

సకల జగములందు వెలుగొందు చైతన్యమొక్కటే. విజ్ఞులు, దానిని వివిధ రూపములుగా వివరిస్తున్నారు. "ఏకం సత్ విప్రా బహుధా వదన్తి" అనే శ్రుతి వచనమునకు సూర్యుడే ప్రమాణము. అతనినే సూర్యనారాయణునిగా లోకము స్తుతిస్తోంది. శివపురాణము శివునిగా ప్రతిపాదిస్తోంది. ఆ శక్తినే భానుమండల మధ్యస్థయైన 'గాయత్రి'గా లలితా సహస్రనామము వివరించింది. ఇలా అనేకమునందు ఏకత్వమును ప్రబోధించటం సమన్వయంతో కూడిన భారతీయ దార్శనికతకు నిదర్శనం. ఈ సూర్యుడే సర్వస్వమని నిరూపించింది సౌర సిద్ధాంతము.

# పురుషార్థముల వైశిష్ట్యము

'పురుషార్థములు'లంటే, ధర్మ-అర్థ, కామ, మోక్షములని పెద్దలు చెప్తారు. ఇక్కడ ఒక ప్రశ్న పుడుతుంది. పురుషులకేనా అవి స్త్రీలకు లేవా? అని. ఈ పురుష శబ్దానికి మానవజాతి సమస్తం అని అర్థం. ఇంక, అర్థములు అంటే ప్రయోజనములని భావము. మానవులందరు ఆచరింపదగినవి, సాధింపదగినవి అని ఫలితార్థము. శ్రీమాతయైన లలితా దేవి సహస్రనామాలలో **పురుషార్థప్రదా! పూర్ణా!** అన్న నామాలు దర్శనమిస్తాయి. అవి ఆచరింపబడి, సిద్ధించినప్పుడు జీవితము పరిపూర్ణమవుతుంది. ఆ జగజ్జనని అనుగ్రహం లభిస్తుంది. ముక్తి రూపిణియైన అమ్మ (ముక్తిదా) ముక్తినిస్తుందని సమన్వయమవుతుంది. పురుషార్థములలో 'ధర్మము' ముఖ్యము. 'అర్థము' అంటే ధనము, 'కామము' అంటే కోరిక. ఇవి జీవులందరికి అవసరమైనవే. ఈ అర్థ, కామములు ధర్మబద్ధములైనప్పుడే అవి గౌరవింపబడతాయి. ధర్మార్థ కామములు తుదకు మోక్షహేతువులవుతాయి. ధర్మ రహితములు అయినవి, పతనకారణములని గుర్తింపబడ్డాయి. అందువలననే, ధర్మాచరణము, మానవులను పశుపక్ష్యాదులకంటే అధికులనుగా పరిగణింపజేయుచున్నది.

**ఆహారనిద్రా భయమైథునాని**
**సమానమే తత్పశుభిర్నరాణామ్।**
**ధర్మోహి తేషామధికోవిశేషః**
**ధర్మేణ హీనాః పశుభిః సమానాః ॥**

ఇందులో **"జ్ఞానేన హీనాః"** అన్నది పాఠాంతరము. యుక్తాయుక్త విచక్షణతో, ధర్మాచరణకు ప్రోత్సహించునది జ్ఞానము. అట్టి జ్ఞానముతో ఆచరించునది ధర్మము. **'సదాచార ప్రవర్తికా'** అన్నది ఆ తల్లి సహస్రనామములలో మఱియొకటి. **"ఆచారః ప్రభవో ధర్మః"** అని విష్ణుసహస్రనామము. ధర్మమును, ప్రభు సమ్మితములైన వేదములు, విధి, నిషేధరూపంలో శాసించాయి. ఇది చెయ్యండి-ఇది చేయకండి అని



సూచించాయి. మిత్ర సమ్మితములైన పురాణ ఇతిహాసములు ఈ విషయాన్ని **'రామాదివత్ వర్తితవ్యం, నరావణాదివత్.'** అని వివరించి, ధర్మవిరుద్ధంగా ప్రవర్తించడం వలన వచ్చే అనర్థాన్ని తెలియజేశాయి. కాంతా సమ్మితములైన కావ్యాలు సురుచిరంగా, సుకుమారంగా ఈ విషయాన్నే ప్రబోధించాయి. వాఙ్మయము సర్వము పురుషార్థ ప్రతిపాదకమై, మానవులను మహోన్నతంగా తీర్చిదిద్దటానికి ప్రయత్నించింది. ఈ శబ్దజ్యోతి లేనినాడు లోకమంతా చీకటే ఆవరించి, అజ్ఞానంలో కొట్టు మిట్టాడేది. తాను కష్టించి సంపాదించుకొన్న ధనం, ఇహపర సాధక మవుతుంది. విధియుక్తంగా వివాహ మాడిన స్త్రీ, సహధర్మచారిణియై సత్సంతాన సమృద్ధికి కారణమవుతుంది. దౌర్జన్యంతో, ఇతరులనుండి దోచుకొన్నవి తమకు, తమవారికి అనర్థదాయకమై అపకీర్తికారణములుగా పరిగణింపబడతాయి.

ఈ ధర్మము వ్యక్తిగతంగా, సమాజపరంగాను భేదం కలిగి ఉంటుంది. ఇందులో ఆశ్రమధర్మాలు **(బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాసములు)** వేరుగా ఉంటాయి. స్త్రీ, పురుషధర్మాలు విడివిడిగా ఉంటాయి. లోకంలో అందరూ సమానమే. అది జీవలక్షణం వరకే పరిమితం. అందరికి ఒకే ధర్మం వర్తించదు. పాలకులు, పాలితులు. గురువు, శిష్యులు. తల్లిదండ్రులు, బిడ్డలు ఇట్టి అవస్థాభేదమును బట్టి, బాల్య కౌమార యౌవన, వార్ధక్య స్థితులననుసరించి ధర్మములు వేరుగా ఉంటాయి. భారతం శాంతిపర్వంలో అనుశాసనిక పర్వములో ధర్మరాజు అడిగితే, భీష్ముడు ఈ విషయాలు వివరంగా చెప్పిన ఘట్టాలు చోటు చేసుకొన్నాయి. మహాభారతం అంతటా ఈ పురుషార్థములు వివరింపబడ్డాయి.

**"శ్రుత్వా, ధర్మా నశేషేణ, పావనాని చ సర్వశః।**
**యుధిష్ఠరశ్శాన్తనవం, పురనేవాభ్యభాషత॥"**

వేదములలో, స్మృతులలో, పురాణములలో ఏదైనా ఒక విషయంలో వాదమేర్పడితే, అందుకు భారతంలో ప్రమాణ సహితంగా పరిష్కారం చెప్పబడింది. అందుకే భారతాన్ని ధర్మశాస్త్రమని కూడా ప్రశంసించారు పెద్దలు.



రచయిత :

భాషాప్రవీణ, విద్యాప్రవీణ

డాక్టర్ తూములూరు శ్రీదక్షిణామూర్తి శాస్త్రి M.A. Ph.D

## శాస్త్రిగారి ఇతర రచనలు - ప్రచురణలు

### ముద్రితములు

1. శ్రీ రామకథా2మృతము - సమగ్ర సమీక్ష ఆంధ్రా యూనివర్సిటీ వారిచే Ph.D. పొందిన పరిశోధన నిబంధము.
2. రామాయణం-సమాజ దర్పణం 1వ భాగము
3. రామాయణం-సమాజ దర్పణం 2వ భాగము
4. శ్రీరామ వాణి
5. వాల్మీకి వాణి
6. హనుమద్వాణి
7. పావనీ శతకము
8. మహాభారత పారిజాతము (సంకలనము) శ్రీలలితాసహస్రనామ వివరణము (అముద్రితము)
9. మాటలంటే మాటలా ?
10. ముసునూరివారి వంశ చరిత్ర
11. తెలుగు వ్యాకరణము
12. భావదేవశతకము
13. శ్రీ వీరాంజనేయ శతకము
14. శ్రీ సత్యనారాయణ శతకము
15. శ్రీ కపోతేశ్వర శతకము
16. శ్రీ రాజరాజేశ్వరీ శతకము
17. శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్రము ప్రతిపదార్థసహితము
18. శ్రీ త్రికూటేశ్వర త్రిశతి
19. యోగవైభవము.

# సారస్వత సౌరభాలు

(మొదటి భాగము)



రచయిత :

భాషాప్రవీణ, విద్యాప్రవీణ


డాక్టర్, తూములూరు శ్రీదక్షిణామూర్తిశాస్త్రి

ఎమ్.ఏ., పిహెచ్.డి.

పొన్నూరు, 81067 66197

